


# యువ విజేతలు

- నేషనల్ చైల్డ్ అవార్డ్ ఫర్ ఎగ్జెప్షనల్ అచీవ్‌మెంట్ (2008)
- సూపర్ కిడ్ (రోటరీ క్లబ్) (2006)
- యంగ్ అచీవర్ అవార్డ్ (2005)
- యంగ్ రోటరీ స్పోర్ట్స్ ఐకాన్ (2005)
- పతకాలు (ఇన్‌లైన్ స్కేటింగ్ – ఐస్ స్కేటింగ్): స్వర్ణం – 64, రజితం – 8, కంచు – 5
- స్విస్ ఇన్‌లైన్ కప్, స్విట్జర్లండ్ (2005)లో ప్రథమస్థానం
- నేషనల్ షార్ట్ ట్రాక్ స్పీడ్ స్కేటింగ్/వింటర్ ర్యాంకింగ్ కాంపిటీషన్,తైపీ (2007)లో 500, 1000 మీటర్ల పోటీలలో ప్రథమస్థానం.
- ఆసియన్ షార్ట్ ట్రాక్ స్పీడ్ స్కేటింగ్ ట్రోఫీ (మహిళల 2000 మీటర్ల పోటీ), తైపీ (2008)లో మూడో స్థానం.

## ఆరతి కస్తూరిరాజ్



ఏడేళ్ల ప్రాయంలో చిన్నారి ఆరతి తల్లిదండ్రులతో కలిసి స్థానిక పార్కుకు వెళ్లినప్పుడు, తన ఈడు పిల్లలు స్కేటింగ్ చేస్తుండటం గమనించింది.

ప్రముఖ కోచ్ కెపి ఉన్ని కృష్ణన్ వద్ద ఆమె స్కేటింగ్‌లో శిక్షణ ప్రారంభించింది. సంవత్సరంలోపే ఆమెను ఆటలో ప్రతిభావంతురాలిగా తీర్చిదిద్దాడు కోచ్. 2001లో ఓ క్లబ్ మీట్‌లో రెండు స్వర్ణ పతకాలు గెల్చుకున్న తర్వాత ఆరతి రోలర్ స్కేటింగ్ ఆటను సీరియస్‌గా తీసుకోవడం ప్రారంభించింది. అప్పటి నుంచి పతకాలు, ప్రశంసలు ఆమెను వెతుక్కుంటూ వచ్చాయి! తన మాటల్లో చెప్పాలంటే, 'వేగం, ఉత్కంఠ స్కేటింగ్‌ని గొప్ప ఆటగా మలిచాయి!''

తల్లిదండ్రులు ఆమెకు అన్నివేళలా మద్దతుగా నిలిచారు. ఆరతి చదువుకుంటున్న పాఠశాల మద్దతుగా నిలిచింది.

ఆటలో అసాధారణ విజయాలు సాధించినందుకు సోనియా గాంధీ చేతుల మీదుగా చైల్డ్ అవార్డ్ అందుకోవడం తన స్పోర్ట్స్ కెరీర్‌లో అత్యంత సంతోషకరమైన విషయంగా ఆమె చెప్పింది.



ఈ స్కేటింగ్ యువరాణికి చందమామ శుభాకాంక్షలు తెలుపుతోంది.

# ఈ సంచికలో...



చందమామ సంపుటి: 63 సెప్టెంబర్ 2010 సంచిక: 9













**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.

# గురువు, మార్గదర్శకత్వం, బాసట...

బోధకుడు/గురువు ప్రాముఖ్యత మాటల్లో వర్ణించలేము. జూలై నెలలో 'గురుపూర్ణిమ' తర్వాత, ఈ నెలలో 'గురుపూజోత్సవం' జరుపుకుంటున్నాము. దౌత్యవేత్త, పండితుడు, అధ్యాపకుడు, భారతదేశ రెండవ రాష్ట్రపతిగా చరిత్రకెక్కిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌ను స్మరించుకుంటూ మనం టీచర్స్ డేని జరుపుకుంటున్నాము.

మనం విద్య నేర్చుకునే ప్రక్రియలో గురువుది మూలస్థానం. అందుకే 'గురుబ్రహ్మ, గురు విష్ణు...' అనే శ్లోకం ఆవిర్భవించింది. వాస్తవానికి మన చుట్టూ ఉన్న ప్రతి ఒక్కరిలో ఒక్కో గురువు ఉంటున్నాడు. కాస్త శ్రద్ధ చూపగలిగితే, మన చుట్టూ ఉన్న ప్రతి ఒక్కరినుంచి మనం ఏదో ఒకటి నేర్చుకోగలం. ప్రతి ఒక్కరినుంచి ఎంతో కొంత నేర్చుకుని మన జీవితాలను మెరుగుపర్చుకోగలమనే ఈ సత్యాన్ని చివరివరకూ మర్చిపోకుండా ఉందాము.

ఈ నెలలో మనం ప్రపంచ పర్యాటక దినం కూడా జరుపుకోబోతున్నాము. 'అతిథి దేవోభవా' అన్నది మన సంస్కృతి, మన తత్వశాస్త్రం ప్రకారం మన దేవుళ్లను గౌరవిస్తున్న రీతిలో మన అతిథులను కూడా గౌరవించాలి. మనలో అసహన స్థాయిలు పెరుగుతున్న ప్రస్తుత కాలంలో ఈ సత్యం మునుపెన్నటికంటే సందర్భోచితంగా ఉంటోంది. పైగా, విడి కుటుంబాలుగా బతికే ధోరణి మనలో పెరిగింది. దీంతో మన ఇంటికి వచ్చే మిత్రులు, బంధువుల రాక కూడా తగ్గిపోయింది.

ఇతర సంస్కృతులతో సంబంధంలోకి వెళ్లడం, కొత్త ప్రాంతాలను సందర్శించడం అనేవి మనం నేర్చుకోవడానికి, మనల్ని మనం తీర్చిదిద్దుకోవడానికి మంచి అవకాశాలను సృష్టిస్తాయి. జ్ఞానవంతులుగా ఎదగటానికి మనం వీలైనన్ని కొత్త ప్రాంతాలను సందర్శించడమే కాక, ఇతర సంస్కృతులనుంచి వీలైనంత ఎక్కువగా నేర్చుకోవడానికి ప్రయత్నించాలి.

ఈ విశాల ప్రపంచంలో మనం ఒకరినుండి ఒకరం నేర్చుకుంటూ, జీవిద్దాం రండి!

– సంపాదకులు





సెప్టెంబర్ 2010 Rs. 20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

**Editor & Publisher:**
Prashant Mulekar
**Associate Editor:**
R. Vaasugi, K. Raja Sekhara Raju
**Sub Editor:**
Patricia Pandian
**Content Head - Online:**
Sowmya Bharadwaj
**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
**Artist:**
Venki
**Creative Writer:**
R. Rama
**Layout Designers:**
K. Narendra Raju
**Production In-charge:**
Prashant Pawar
**Circulation:**
e-mail: circulation@chandamama.com
**Head - Sales and Circulation:**
Sanjay B Thorat
**Manager - Sales & Circulation:**
AB Sairam
**Manager - Sales & Circulation (West & North):**
Vinay K Brid
**Asst. Manager - Sales & Circulation (East):**
Subhankar Rej
**Sales Officer - Circulation:**
K. Ravishankar
**Advertisement:**
e-mail : sales@chandamama.com
**Subscription:**
e-mail: Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2829
Jalpa Doshi (Mumbai)
Ph: +91 22 2831 2872/2831 1849
**Head Office : CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Editor : Prashant Mulekar




# పాఠకుల లేఖలు



జూన్ సంచికలో ''మన జీవిత సత్యాలు'' కథా రూపంలో పిల్లలకు ఎంతో నచ్చే విధంగా తీర్చిదిద్దారు. నిజంగా పిల్లల మనస్తత్వంపై మీరు చేస్తున్న ఈ ప్రయోగం ఎంతో ఉపయుక్తంగా ఉంది. పిల్లలు తమలో దాగి ఉన్న ప్రతిభా సామర్థ్యాలను వెలికితీసి ఇతరులకు చాటి చెప్పే అవకాశం ఇచ్చినందుకు ధన్యవాదాలు. – పులిజాల రవీందర్ రావు, హైదరాబాద్

జూన్ చందమామ సంచిక జూన్ 26న మార్కెట్లోకి వచ్చింది. విపరీతంగా ఆలస్యం జరుగుతోంది. ఫోటో వ్యాఖ్యల పోటీ లేకుండా పత్రిక బోసిపోయింది. చందమామ మొదటి నుంచి ఈ పోటీ ఉంది. పాత చందమామలను తలపిస్తూ మళ్లీ కథలు వేస్తున్నారు. చాలా బాగుంది. ఆర్య బొమ్మల కథ 4 పేజీలు మింగేస్తోంది. ఆపివేసి చిన్న కథలు వేయండి. జానపద కథలు, పిశాచాల కథలు పాతవి మళ్లీ వేయండి, చందమామను మించిన పత్రిక ఎప్పుడూ రాలేదు, మరెప్పుడూ రాదు!

– బి.రాజేశ్వరమూర్తి, చిలకలపూడి (కృష్ణా జిల్లా)

సహజరంగులతో, చక్కని వయ్యారి భామలతో, వెలసిన జూన్ సంచిక ముఖచిత్రం హృద్యంగా ఉంది. నీటి దుర్వినియోగం జరగకుండా ఇచ్చిన సలహాలు బాగున్నాయి. నిజాయితీ తీర్పు బాగుంది. శివ కృప కోసం 54 కోట్ల నమశ్శివాయ మంత్రాలు నిక్షిప్తం చేయడం సామాన్యమైన పని కాదు. పెద్ద పెద్ద కథలతో పాటు చిన్న కథలు కూడా వేయండి. చందమామ గడినుడి ఉంచండి.

– వాస్తు రామచంద్ర, నెల్లూరు

మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా పంపవచ్చు.



**Visit us at : http://telugu.chandamama.com**

**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

'I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..............................................................................................

Date of Birth: .................................. Sex :.......................................

Address: ...........................................................................................

.........................................................................................................

.........................................................................................................

........................................................ City: ...........................................

State:.......................................... Pin:..............................................

Telephone:.........................................................................................

Mobile:..............................................................................................

Email:................................................................................................

Subscription Number (for renewals):..............................................

Gift Subscription to the following address:

.........................................................................................................

.........................................................................................................

.........................................................................................................

.........................................................................................................

Enclosed Cheque/DD* for Rupees..................................................

Cheque/DD No ...............................................................................

favouring Chandamama India Ltd on..............................................

.................................................................................................bank.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.



# కాలక్షేపం

రామేశ్వరం పోతున్న యాత్రికులతో పాటు ఇద్దరు యువకులు ప్రయాణం చేస్తున్నారు. వాళ్లలో ఒకడు, రెండోవాణ్ణి, ''అవునూ-- అన్నట్టు మనదే ఊరు?'' అని అడిగాడు.

''కమలాపురం,'' అన్నాడు రెండోవాడు

''అలాగా, మాదీ అదే ఊరు. మీరుండేది ఏ వీధిలో?'' అని ప్రశ్నించాడు మొదటి వాడు.

''జగదాంబ వీధి,'' అన్నాడు రెండోవాడు.

''విడ్డూరంగా ఉందే! మాదీ అదే వీధి. వీధిలో ఎటువైపు మీ ఇల్లు?'' అన్నాడు మొదటి వాడు.

''శివాలయానికి ఎడమవైపు ఉన్న రెండో ఇల్లు,'' అన్నాడు రెండోవాడు.

''నేనుండేదీ ఆ ఇంట్లోనే!'' అన్నాడు మొదటివాడు ఆశ్చర్యపోతూ.

ఇదంతా వింటూన్న తోటి యాత్రికులు, ''ఏమయ్యా, మీ ఇద్దరూ ఉండేది ఒకే ఊరు, ఒకే వీధి అంటున్నారు. ఇంతవరకూ ఒకర్నొకరు ఎరగరా?'' అని అడిగారు.

''ఎరక్కపోవడం ఏమిటి? మేమిద్దరం అన్నదమ్ములం. దూర ప్రయాణం గదా అని కాలక్షేపానికి ఏదో మాట్లాడుకుంటున్నాం,'' అని నవ్వుతూ జవాబిచ్చారు, ఇద్దరు యువకులూ.

వాళ్ల పిచ్చి సరదా చూసి, మిగిలిన యాత్రికులు పెద్దగా నవ్వడం ప్రారంభించారు.

– బి.రఘురామరాజు.





# పొగడ్తలు



ఆదిత్యసేనుడు అనే రాజు ఆస్థానంలో చాలామంది ఉద్యోగులుండేవారు. వాళ్లు ఏమాత్రం అవకాశం దొరికినా ఆయనను అంతవాడివి, ఇంతవాడివి అంటూ ముఖ స్తుతితో, పొగడ్తలతో విసిగిస్తూ ఉండేవాళ్లు. రాజుకు వాళ్ల పొగడ్తలు నిజాయితీతో అనేవి కాదని తెలుసు. అలా అని వారి మితిమీరిన పొగడ్తలను ఎప్పుడూ అడ్డుకునే ప్రయత్నం చేయలేదు.

ఒకనాటి రాత్రి, భరించలేనంత చలి వేస్తున్నప్పటికీ, ఆదిత్యసేనుడు రాజ ప్రసాదం వదిలి బయలుదేరాడు. ఎక్కడైనా ముఖస్తుతి పరాయణుడు కానటువంటి నిజాయితీ పరుడు కనిపిస్తాడేమో చూడాలనిపించిందాయనకు.

రాజు నిండుగా ఒకశాలువా కప్పుకుని వీధి వెంట నడవసాగాడు. కొంత దూరం వెళ్లాక, ఆయనకు ఒక ఇంటి అరుగుమీద ముడుచుకు పడుకున్న మనిషి ఒకడు కనిపించాడు. ఆదిత్యసేనుడు అతడిని సమీపించి, ''నీకు చలిపుట్టడం లేదా?'' అని అడిగాడు.

అందుకు వాడు, 'నేను కప్పుకున్నది చిరుగులపాత. అందువల్ల, చలిగాలి ఒక మైపు చిరిగిన కంతల్లో ప్రవేశించి, మరొకమైపు కంతల్లో నుంచి బయటకి పోతుంది. కాని, మీరు కప్పుకున్న శాలువాలో చలి గాలి ప్రవేశించిందో– ఇక దానికి బయటకి పోయే అవకాశం ఉండదు. ఆ కారణంగా మీరు చలిని తట్టుకోలేక పోతున్నారు, నేను తట్టుకోగలుగుతున్నాను!'' అన్నాడు.

రాజుకు, వాడి హాస్యధోరణి నవ్వు తెప్పించింది. ఆయన వాణ్ణి, ''నా దగ్గిర నూరు బంగారు కాసులున్నవి. వాటిల్లో ఇరవై నీకిస్తాను, నన్ను రాజంతటివాడివని పొగడగలవా?'' అని అడిగాడు.

''ఇరవై కాసులేనా? అయ్యా, అంత చిన్నమొత్తానికి, మిమ్మల్ని అంత గొప్పగా

డి. రవిచంద్రరాజు

పొగడటం కుదరదు,'' అన్నాడు వాడు చిన్నగా నవ్వుతూ.

''ఒకవేళ, నా దగ్గిర ఉన్నదాంట్లో సగం కాసులు నీకు ఇచ్చాననుకో, అప్పుడు?'' అని ప్రశ్నించాడు రాజు కుతూహలంగా.

''అప్పుడు మనం ఇద్దరం సమానులమై పోతాం కదా. మిమ్మల్ని పొగడవలసిన అవసరం మరిక ఉండదు.'' అన్నాడా పేదవాడు.

ఆదిత్యసేనుడికి వాడి జవాబు చాలా ఆనందం కలిగించింది. తను అక్కడి నుంచి కొంత దూరం వెళితే, ధనాశకొద్దీ వాడు తనను పిలుస్తాడేమో చూడాలనుకుని, ఆయన ముందుకు నడిచాడు. అయినా, పేదవాడు ఆయన్ను పిలవలేదు. గత్యంతరం లేక రాజు తిరిగి వాడి దగ్గిరకు వచ్చాడు.

''అయ్యా, తమరేదో నన్ను మళ్ళీ ఇంకేదో ప్రశ్నించేందుకు వచ్చినట్టుంది!'' అన్నాడు వాడు.

''ప్రశ్నించడానికి కాదు; నీ నుంచి పొగడ్తలు కోరి వచ్చాను. నా దగ్గిర నూరు బంగారు కాసులున్నవని ముందే చెప్పాను గదా!'' అన్నాడు రాజు.

''అవును'' అన్నాడు పేదవాడు.

''సరే, ఆ నూరు బంగారు కాసులూ ఇస్తాను. అప్పుడు నన్ను రాజంతవాడివని పొగడగలవు గదా?'' అన్నాడు రాజు.

ఆ మాటలకు పేదవాడు, ''అయ్యా, మీరన్నట్లు ఆ బంగారు కాసులన్నీ, నావి అయినప్పుడు, ఇక మిమ్మల్ని పొగడవలసిన అవసరం ఏమున్నది? బహుశా, మీరే అవసరం కొద్దీ అప్పుడు నన్ను పొగడవచ్చు!'' అన్నాడు పెద్దగా నవ్వుతూ.

ఆదిత్యసేనుడు కూడా వాడితో పాటు నవ్వాడు. తర్వాత ఆయన వాడికి నూరు బంగారు కాసులూ ఇవ్వడమే కాక, తానెవరైనదీ చెప్పి, వాణ్ణి తన అంతరంగిక సలహాదారుగా నియమించుకున్నాడు.

ఆ తరువాత ఆనోటా, ఈనోటా జరిగినది విన్న రాజోద్యోగులు, ఆనాటి నుంచీ రాజును, అయినదానికీ కానిదానికీ పొగడడం మానుకున్నారు. రాజుగారి సమస్యకు పరిష్కారం అలా కుదిరింది.





# మేలు-కీడు

సుధర్ముడనే రాజు దగ్గిరికి భటులు ఒక యువకుణ్ణి తీసుకువచ్చారు. వాడు పరదేశీయుడు. బాటసారులపై పడి దోచుకుని, ఒకరిని హత్య చేశాడన్న నేరం మోపి, వాణ్ణి రక్షక భటులు బంధించి తెచ్చారు. రాజు విచారణ జరిపి వాడికి మరణదండన విధించాడు.

పెడరెక్కలు విరిచి కట్టబడి ఉన్న వాణ్ణి భటులు అవతలికి లాక్కుపోయారు. అప్పుడు వాడు ఏవేవో మాట్లాడసాగాడు. ఆ భాష రాజుకు అర్థం కాలేదు. ఏమిటని మంత్రిని అడిగాడు.

‘‘మీ ధర్మ నిరతిని వాడు మెచ్చుకుంటున్నాడు!’’ అన్నాడు మంత్రి

రాజు చిన్నగా నవ్వి, ‘‘అలాగా! అయితే వాడికి మరణశిక్ష రద్దు చేసి, ఏడాదిపాటు కారాగారంలో బంధించండి చాలు!’’ అన్నాడు

వెంటనే సభలోనుంచి ఒకడు లేచి నిలబడి, ‘‘రాజా, వాడు మిమ్మల్ని కీర్తించడం లేదు, దూషిస్తున్నాడు. వాడు మాట్లాడే భాష నాకు తెలుసు.’’ అన్నాడు.

రాజు ఆ మాటలు విని ఒక్క నిమిషం మౌనం వహించి, తరవాత అతనితో ‘‘మంత్రి చెప్పిన అబద్ధం ఒక ప్రాణాన్ని రక్షించింది. ఇప్పుడు నువు చెప్పే నిజం ఒక ప్రాణం బలి కావాలంటున్నది. కీడు కలిగించే సత్యం కన్నా, మేలు చేసే అబద్ధమే శ్రేయస్కరం’’ అని భటులకేసి తిరిగి, ‘‘వాణ్ణి కారాగారంలోనే బంధించండి,’’ చాలు! అన్నాడు.

సభికులు హర్షధ్వానాలు చేశారు.

– మంజుభారతి





# మట్టిపట్టితే బంగారం



ఒక రైతుకు ఒక కొడుకు ఉండేవాడు. ఆ కుర్రవాడు చిన్నవాడుగా ఉండగానే తల్లి పోయింది. కొంత కాలానికి రైతు కూడా జబ్బుపడి తన అవసాన కాలం సమీపించిందని గ్రహించి, కొడుకును పిలిచి బోధచేశాడు.

''నాయనా, నేను పేదవాణ్ణి కావటాన నీకు ఆస్తిపాస్తులేమీ ఇవ్వలేకపోతున్నాను. కాని నువు మట్టిని పట్టుకున్నా అది బంగారం కావాలని మనసారా ఆశీర్వదిస్తున్నాను,'' అన్నాడు.

కొన్నాళ్ళకు తండ్రి పోయాక కొడుకు తన తల్లిదండ్రులను భక్తితో స్మరించి, కష్టపడి పని చేయసాగాడు. అతని కృషి ఫలించి త్వరలోనే అతనికి ఒక సొంత ద్రాక్షతోట ఏర్పడింది.

ఆ చుట్టుపక్కల ఉన్న అన్ని తోటల కన్న అతని ద్రాక్షతోట ఎక్కువ ఫలవంతమవుతూ వచ్చింది. కొంత కాలం గడిచాక అతను మరి కొన్ని పళ్ల తోటలు కొన్నాడు. జాలారి పడవలు కొని చేపల వ్యాపారం మొదలుపెట్టాడు.

నూనె గానుగలు పెట్టాడు. నూనె మీదా, చేపల వ్యాపారంలోనూ విపరీతంగా లాభాలు వచ్చాయి.

త్వరలోనే అతను నగరంలోని పెద్ద ధనికులలో ఒకడయాడు. అతను ఏది తలపెట్టినా దానికి రెండింతలుగా కలిసి వచ్చింది. అతను భోగ భాగ్యాలతో తులతూగుతూ, రాజభవనం లాంటి ఇంట్లో కాపురం చేస్తూ, ఒకసంపన్నుడి కుమార్తెను పెళ్లాడి, ఏ లోటూ లేకుండా హాయిగా జీవిస్తున్నాడు.

కాని ఒకనాడు అతనికి తన అదృష్టం గురించి జంకు పుట్టింది. అతడు తన ఆప్తమిత్రుడితో, ''మిత్రమా, నా శక్తిసామర్థ్యాలకు మించిన అదృష్టం నాకు పట్టుకున్నది. అందుచేత నాకేమో భయంగా

ఉన్నది. తేలికగా వచ్చిన లక్ష్మి తేలికగానే పోవచ్చునని సామెత. పెద్దమ్మకు నాపై ఆగ్రహం రావచ్చు. ఆమె సంతృప్తి కోసం కొంత నష్టపోయే పని ఏదన్నా చేద్దామని ఉన్నది. నమ్మకంగా నష్టం వచ్చే మార్గం ఏదన్నా ఉన్నదేమో కాస్త ఆలోచించి చెప్పు,'' అన్నాడు.

అతని మిత్రుడు కొంచెం ఆలోచించి, ''ఖర్జూరాలు ఎక్కడినుంచి వస్తాయి?'' అని అడిగాడు.

''కైరో నుంచే గద!'' అని జవాబిచ్చాడు మనవాడు.

''ఇకనేం? ఇక్కడ దొరికినంత ఖర్జూరం వీలయినంత హెచ్చు ధరకు కొను, దాన్ని ఒంటెల మీద కైరో నగరానికి తీసుకుపోయి, అక్కడ పలికే తక్కువ ధరకు పోటీ పడి అమ్ము. నీకు నమ్మకంగా నష్టం వస్తుంది,'' అన్నాడు మిత్రుడు. ఈ సలహా మనవాడికి నచ్చింది.

అతను మర్నాడు నగరంలోని వర్తకుల వద్ద ఎంత ఖర్జూరం ఉంటే అంతా టోకున కొనేశాడు. ధర కూడా మామూలు కన్నా హెచ్చుగానే ఉన్నది.

తరవాత అతను కొన్ని ఒంటెలను కిరాయికి తీసుకుని, ఖర్జూరాల గంపలు వాటిమీది కెక్కించి, కైరోకు ప్రయాణమై వెళ్ళాడు.

చాలా రోజులపాటు ఎడారి మీదుగా ప్రయాణం చేసి అతను పిరమిడ్లు ఉండే ప్రాంతానికి చేరుకుని, వాటిని చూసి ఆశ్చర్యపోతూ నిలబడి ఉన్నాడు.



అదే సమయంలో, ఒక తెల్ల గుర్రం ఎక్కి ఈజిప్టు దేశపు రాజు అటుగా వచ్చాడు. రాజుగారితో పాటు ఆయన పరివారమూ, అనేకమంది సైనికులూ ఉన్నారు. సైనికులందరి చేతుల్లోనూ ఆయుధాలు ఉండడానికి బదులుగా జల్లెడలున్నాయి!

మనవాడు రాజుకు నమస్కారం చేసి, ''ప్రభూ, ఈ సైనికులందరూ జల్లెడలతో వచ్చారు. ఏమిటి విశేషం?'' అని మర్యాదగా అడిగాడు.

దానికి రాజు, ''ఏం చెప్పమంటావు? ఈ రోజు ఉదయం నేను ఇటువైపుగా గుర్రం మీద షికారు వచ్చాను. నా పెళ్లి ఉంగరం ఎక్కడో పడిపోయింది. అది నాకు ప్రాణప్రదమైన ఉంగరం. అది దొరికేంత వరకు ఈ ప్రాంతాన గల ఇసుక యావత్తూ జల్లెడ పట్టించ దలిచాను,'' అన్నాడు.

కొంతసేపు తరవాత ఆయన, ‘‘కైరోకు ఏం పనిమీద పోతున్నావు?’’ అని మనవాణ్ణి అడిగాడు.

‘‘కైరోలో ఖర్జూరాలు అమ్ముదామని బయలు దేరాను,’’ అన్నాడు మనవాడు ఒంటెల మీద ఉన్న ఖర్జూరాల తట్టలను చూపిస్తూ.

రాజు ఒక్కసారిగా నిర్ఘాంతపోయి, ‘‘కైరోలో ఖర్జూరాలెలా అమ్ముతావు? దగ్గిరలో ఉన్న ఈ ఖర్జూర చెట్లకేసి ఒకసారి చూడు. ఎలా విరగకాశాయో! ఒక్క చెట్టు కాయలు కోయడానికి పూర్తిగా ఒక్క రోజు చాలదు. ఇలాంటి సమయంలో, నీవు నీ సరుకు తీసుకుపోతే బుట్టకు ఒక రాగి నాణెం పైన రాదు. నువు చాలా నష్ట పోతావు,’’ అన్నాడు.

ఈ మాటలకు రాజు వెంట ఉన్న వారంతా గొల్లున నవ్వారు.

అప్పుడు మనవాడు తన కథను రాజుకు వివరంగా చెప్పాడు. తాను నష్టపోవడానికే కైరో రాజ్యంలో కర్జూరను అమ్మడానికి వెళుతున్నానని చెప్పి, ‘‘మీరు అంటు న్నారు గాని నాకు నష్టం రాదేమో అన్న భయం ఉండనే ఉన్నది. మా నాన్న చనిపోతూ నాకు చేసిన దీవెన ఫలితంగా నేనిలా మట్టి పట్టుకుంటేనే అది బంగా రమవుతున్నది,’’ అంటూ వంగి గుప్పెడు ఇసుక తీశాడు.

అతను చెయ్యి విప్పేసరికి ఇసుక జారిపోయి అతని అరిచేతిలో బంగారు ఉంగరం మిగిలింది.

అప్పటిదాగా తన సైనికులతో తన పెళ్ళి ఉంగరం కోసం గాలిస్తున్న రాజు ‘‘అదే నేను పోగొట్టుకున్న ఉంగరం!’’ అన్నాడు ఆశ్చర్యంగా.

ఆయన మనవాడి అదృష్ట రేఖను మెచ్చుకుని, తన ఉంగరం తేలికగా తనకు దొరికేటట్టు చేసినందుకు గాను అతనికి ఎన్నో విలువగల కానుకలిచ్చి తిప్పి పంపేశాడు.

ఆవిధంగా నష్టం కోసం వెళ్ళినవాడు కాస్తా మరింత లాభం చేసుకుని, మన వాడు తన ఇంటికి తిరుగు ప్రయాణం చేశాడు.



బేతాళ కథలు

# వారసుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీకున్న దీక్ష, పట్టుదల అసాధారణమైనవి. అందులో సందేహం లేదు. అయితే, వాటికి తగ్గ యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం నీలో ఉన్నదా అన్న విషయం నాకు తెలియదు. ఎందుకంటే అధికారం, ధనం మితంగా ఉన్నప్పుడే మనిషికి శాంతి సౌఖ్యాలూ, నిదానంగా ఆలోచించే ఓర్పూ ఉంటాయి. మితిమించితే అహంకారాన్ని పెంచి యుక్తాయుక్త విచక్షణాజ్ఞానాన్ని నశింపజేస్తాయి. మితిమించిన ధనసంపద కారణంగా, విచక్షణారహితంగా నిర్ణయం తీసుకున్న వజ్రనాభుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

విక్రమపురంలో వజ్రనాభుడనే ఒక ధనిక వర్తకుడు ఉండేవాడు. ధనంతో



పాటు అరుదైన దయాగుణం కలవాడు కావడంవల్ల ఆయన అడిగినవారికి లేదనకుండా దానధర్మాలు చేసేవాడు.

సకల సంపదలూ ఉన్నప్పటికీ ఆయన్ను కొంతకాలంగా ఒక తీరని విచారం పట్టి పీడించ సాగింది. ఆయనకు సంతానం కలగకపోవడమే అందుకు కారణం. వారి తదనంతరం వారి ఆస్తిపాస్తులను నిర్వహించి అనుభవించగల వారసుడు కలగలేదని ఆయనా, ఆయన భార్యా తరచూ తీవ్రమైన ఆవేదనకు లోను కాసాగారు.

ఇకమీదట వారికి సంతానం కలిగే అవకాశం లేదని గ్రహించిన బంధువులు కొందరు వారి ఆస్తిమీది ఆశతో, వారిమీద లేనిపోని ఆదరాభిమానాలు కనబరచేవారు. అలాంటి వారి చర్యలు వజ్రనాభుడి వేదనను మరింత ఎక్కువ చేసేవి.

ఒకనాడు వజ్రనాభుడి దూరపుబంధువు నాగేంద్రవర్మ వాళ్ళ ఇంటికి వచ్చాడు. భోజనం అయ్యాక, నాగేంద్రవర్మ వజ్రనాభుడితో, ''మా అబ్బాయి చంద్రశేఖరుడు చాలా తెలివైనవాడు. స్థానికంగా ఉన్న విద్యాలయంలో విద్య పూర్తి చేశాడు. వాణిజ్యశాస్త్రంలో ఉన్నతవిద్యనభ్యసించాలంటే మణిద్వీపానికి వెళ్ళాలి. అందుకు తగ్గ ఆర్థికస్థోమతు నాకు లేదు. మీరు దయ తలిస్తే, వాడు ఉన్నత విద్యను పూర్తి చేయగలడు,'' అన్నాడు.

''సరస్వతీ కటాక్షం ఉండాలేకాని, ధనం కోసం వెనుకాడకూడదు. మీ వాడు మణిద్వీపంలో ఉన్నత విద్యను అభ్యసించడానికి అయ్యే ఖర్చులను నేను భరిస్తాను. వాడు విద్యావంతుడు కావడం మనకందరికీ సంతోషకరమైన విషయమే కదా!'' అంటూ వజ్రనాభుడు అందుకు కావలసిన ధనం ఇచ్చి పంపాడు.

ఈ విషయం తెలిసిన వజ్రనాభుడి బంధువులు–వజ్రనాభుడు చంద్రశేఖరుడి తెలివితేటలకు ముగ్ధుడై, అతని ఉన్నత విద్యకు ధనసహాయం చేశాడు గనక, అతన్నే తన వారసుడిగా తీసుకునే అవకాశం ఉందని తమలో తాము అనుకోసాగారు.

వజ్రనాభుడు ఒకనాడు భార్యతో కలిసి దేవాలయానికి వెళుతూండగా, ''అయ్యా, ఆకలి!'' అంటూ ఒక కుర్రవాడు కనిపించాడు. వజ్రనాభుడు వాడి చేతిలో కొన్ని నాణాలు ఉంచాడు. కుర్రవాడి కళ్ళు ఆనందంతో మెరిశాయి.

వజ్రనాభుడు ఒక వారం తరవాత గుడికి వెళ్ళినప్పుడు అదే కుర్రవాడు అక్కడే

కనిపించాడు. అయితే వాడిప్పుడు బిచ్చ మెత్తడం లేదు. పూలదండలు అమ్ముతూ ఎదురుపడ్డాడు. వజ్రనాభుణ్ణి చూడగానే కుర్రవాడు చేతులు జోడించి, ''అయ్యా! మామూలుగా మీలాంటి వాళ్ళు చేసే ధర్మాలు పొట్ట నింపుకోవడానికే సరిపో యేవి. అయితే, ఆ రోజు మీరు ఇచ్చిన నాణాలు తిండికి పోగా కొంత మిగిలాయి. వాటితో పువ్వులు కొని మాలలు కట్టి అమ్మడం ప్రారంభించాను. నా బతుకు గడిచిపోతున్నది. మీ దగ్గర పుచ్చుకున్న డబ్బు ఎప్పుడో ఒకప్పుడు మీకు తిరిగి చెల్లించగలననే నమ్మకం నాకున్నది,'' అన్నాడు సంతోషంగా.

ఆ మాటలు వజ్రనాభుడికి ఎంతో ఆనందం కలిగించాయి. ఆనాటి నుంచి ఆయన గుడికి వెళ్ళడం; ఆ కుర్రవాడి దగ్గర పూలదండ కొనడం నిత్యకృత్యంగా మారింది. ఇలా కొంతకాలం గడిచింది.

ఒకనాటి అర్ధరాత్రి సమయంలో వజ్రనాభుడు నిద్రపట్టక ఏదో ఆలోచిస్తూండడం గమనించిన ఆయన భార్య, ''ఆ దేవుడు మనకు అన్నీ ఇచ్చాడేగాని, సంతానం ఇవ్వలేదు. మన బంధువుల్లో ఎవరినో ఒకరిని దత్తత తీసుకుంటే, మీకు వ్యాపార వ్యవహారాలలో సహాయంగా ఉండగలడు కదా?'' అన్నది.

''అవును. నేనూ అదే ఆలోచిస్తున్నాను. దైవభీతి ఉన్నవాళ్ళే, ధనాన్ని సక్రమంగా వినియోగించగలరన్నది నా దృఢమైన విశ్వాసం. అందుకే ధర్మబుద్ధీ, దైవభీతీ ఉన్న సద్గుణ సంపన్నుడి కోసం వెతుకుతు న్నాను,'' అన్నాడు వజ్రనాభుడు.

''దైవసంకల్పం ఎలా ఉంటే అలా జరుగుతుంది. నిశ్చింతగా నిదురపొండి,'' అంటూ నిద్రకు ఉపక్రమించింది ఆయన భార్య.

మరుసటి రోజు సాయంకాలం, వజ్ర నాభుడు యధాప్రకారం దేవాలయానికి వెళ్ళినప్పుడు, ఒక యువకుడు ఆయన





దృష్టిని ఆకర్షించాడు. ఆ యువకుడు ఆలయ మంటపంలో ఒక మూలగా పద్మాసనం వేసుక్కూర్చుని ధ్యాన నిమగ్నుడై కనిపించాడు. ఆరోజే కాకుండా వరుసగా నాలుగు రోజులు ఆ యువకుడు ధ్యానం చేస్తూ ఉండడం ఆయన గమనించాడు. ఐదవ రోజు యువకుడు ధ్యానం ముగించే వరకు ఆయన అక్కడే వుండి, అతడు కళ్ళు తెరిచాక, ''నీ పేరేమిటి నాయనా? నువ్వెవరివి? ఏం చేస్తూంటావు?'' అని అడిగాడు.

''నేనొక అనాథను. నన్ను సత్తెయ్య అంటారు. నిరంతరం భగవధ్యానం తప్ప మరొకటి ఎరుగను,'' అన్నాడా యువకుడు ఎంతో వినయంగా. ''మరి ఆహారం మాటేమిటి?'' అని అడి గాడు వజ్రనాభుడు.

''భగవధ్యానంలో కూర్చుంటే నాకు ఆకలి దప్పికలుండవు. అయినా, అఖిల జీవరాసులను కంటికి రెప్పలా కాపాడే ఆ దేవుడు, ఏ ధర్మాత్ముడి ద్వారా అయినా నా ఆకలి చల్లార్చకపోతాడా?'' అన్నాడు యువకుడు.

ఆ సమాధానం వజ్రనాభుడికి ఎంతగానో నచ్చింది. ''నేను వెతుకుతూన్న యువకుడు ఇతడేనేమో! భగవత్సంకల్పం కూడా అదే నేమో!'' అనుకున్నాడు.

ఆయన ఇంటికి వెళ్ళి గుడిదగ్గర చూసిన సత్తెయ్యను గురించి భార్యకు చెప్పాడు. ఆమె చాలా సంతోషించింది. మరికొన్నాళ్ళు ఆ యువకుణ్ణి గమనించి చూడాలనుకున్నారా దంపతులు.

ఆనాటినుంచి వజ్రనాభుడి సేవకులు సత్తెయ్యకు మూడు పూటలూ ఆహారం అందించసాగారు. అతడి చర్యలను గమనించడానికి వజ్రనాభుడు మనుషులను ఏర్పాటుచేశాడు.

కొన్ని రోజులు గడిచాక వజ్రనాభుడు ఏర్పాటు చేసిన మనుషులు, ఆయన వద్దకు వచ్చి, సత్తెయ్య తరచూ ధారలు ధారలుగా కన్నీళ్ళు కారుస్తూ మౌనంగా ఏడుస్తున్నట్టు చెప్పారు. వజ్రనాభుడు ఆ రోజు సాయంకాలం గుడి దగ్గరికి వెళ్ళి సత్తెయ్యతో, ''నువ్వు మౌనంగా రోదిస్తున్నట్టు తెలిసింది. నీకొచ్చిన కష్టం ఏమిటి? నీ సమస్యను చెబితే పరిష్కరించడానికి ప్రయత్నిస్తాను,'' అన్నాడు.

సత్తెయ్య లేచి వజ్రనాభుడి పాదాల పైబడి, ''అయ్యా, నన్ను క్షమించండి,'' అంటూ ఆయన పాదాలను గట్టిగా పట్టుకుని రోదించసాగాడు.

"నేను నిన్ను క్షమించడమేమిటి? అసలు సంగతేమిటో చెప్పు," అన్నాడు వజ్రనాభుడు.

"నేను మీరు అనుకుంటున్నట్టు భక్తుణ్ణి కాను; దొంగను! ఒకనాటి అర్ధరాత్రి సమయంలో దొంగతనం చేయాలని మీ ఇంట్లోకి ప్రవేశించాను. ఆ సమయంలో మీరు దైవభక్తిగల యువకుణ్ణి దత్తత తీసుకోవాలని మీ భార్యతో చెప్పడం నేను విన్నాను. మీ ఆస్తికి వారసుడినయ్యే అపూర్వ అవకాశం లభించినట్టు పొంగిపోయాను. తగిన పథకం ఆలోచిస్తూ గుట్టుచప్పుడు కాకుండా ఇంటి నుంచి బయటపడ్డాను. మరునాడు మీరు గుడికి వస్తున్నట్టు తెలిసి, మిమ్మల్ని మోసపుచ్చడానికి భక్తుడిగా ధ్యానం చేస్తున్నట్టు నటించడం మొదలు పెట్టాను. మీరు నన్ను చూశారు. ఆ తర వాత అన్నీ నేను ఊహించినట్టే జరిగాయి. అయితే, రోజులు గడిచేకొద్దీ, నిజంగానే దేవుడిమీద భక్తి ఏర్పడింది. నేను గతంలో చేసిన దొంగతనాలనూ, మోసాలనూ, పాప కృత్యాలనూ తలుచుకున్నప్పుడల్లా విషా దంతో కన్నీళ్ళు పెల్లుబక సాగాయి!" అన్నాడు సత్తెయ్య.

ఆ మాటలు విని వజ్రనాభుడు ఒక్క క్షణం దిగ్భ్రాంతి చెందాడు.

సత్తెయ్య మళ్ళీ, "మీరు ధర్మాత్ములు! మిమ్మల్ని పచ్చిగా మోసం చేయడానికి ఎత్తుగడ వేసిన నేను పాపాత్ముణ్ణి. నాకు ఎలాంటి శిక్షనైనా విధించండి. దానిని అను భవించాక ఈ నగరం విడిచి వెళ్ళిపోతాను," అన్నాడు.



వజ్రనాభుడు కొంతసేపు తీవ్రంగా ఆలోచించి, తల పంకించి, "సత్తెయ్యా! నువ్వు ఈ నగరం వదిలి వెళ్ళవలసిన పనిలేదు. నువ్వే నా వారసుడివి," అంటూ అతన్ని వెంటబెట్టుకుని తన ఇంటికి బయలుదేరాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వజ్ర నాభుడు, నేను దొంగను అని స్వయంగా చెప్పిన సత్తెయ్యను తన వారసుడిగా తీసు కోవడం మితిమించిన సంపదల కారణంగా ఆయన తన విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయా డన్న విషయాన్ని తేటతెల్లం చేస్తున్నది కదా? తన సాయంతో వాణిజ్యశాస్త్రంలో ఉన్నత విద్యను అభ్యసించిన తన బంధువు చంద్ర శేఖరుడూ; అతిస్వల్పమైన ఆదా యంతోనే తన కాళ్ళమీద నిలబడగలిగిన సమర్థుడైన పూలమ్మే యువకుడూ కళ్ళె దుటే ఉండి కూడా– కపటవర్తనుడైన

కరుడుకట్టిన దొంగను తన సంపదలకు వారసుడిగా నియమించడం వజ్రనాభుడి మూర్ఖత్వం అని పించుకోదా? ఈ సందే హాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తన వార సుణ్ణి ఎంపిక చేయడంలో వజ్రనాభుడు తగిన నిర్ణయమే తీసుకున్నాడు. స్వత హాగా ఉపకార బుద్ధి కలవాడు గనక, ఆయన బంధువైన చంద్రశేఖరుడి ఉన్నత విద్యకు ధనసహాయం చేశాడు. అంతేగాని, అతన్ని తన వారసుడిగా చేసుకోవాలన్న ఉద్దేశంతో కాదు. ఇక బిచ్చగాడుగా ఉండి వ్యాపా రిగా మారిన కుర్రవాడికి డబ్బు విలువా, దానిని సంపాదించే మార్గమూ తెలుసు. అయితే, అప్పటికే వజ్రనాభుడివద్ద ఉన్న ధనాన్ని ఎలా వినియోగించుకోగలడో ఊహించలేము. సత్తెయ్య వజ్రనాభుణ్ణి మోసపుచ్చాలన్న కపటబుద్ధితో భక్తుడిగా నటించడం మొదలుపెట్టిన మాట వాస్త వమే.

అయితే, నిరంతర భగవద్ధ్యానం, వజ్రనాభుడి ఉదార ప్రవర్తన, తీవ్రమైన ఆత్మపరిశీలన వాడి మానసిక ప్రవృత్తిని పూర్తిగా మార్చివేశాయి. వాడి మనసులో పెల్లుబికిన పశ్చాత్తాపం వాడి పాపకృత్యా లను ప్రక్షాళనం చేసింది. అందు వల్లే వాడు తన అసలు చరిత్రను దాపరికం లేకుండా బయటపెట్టి శిక్ష కోరుకున్నాడు. సత్తెయ్య నిన్నటివరకు దొంగకావచ్చు. అయితే ఇప్పుడు పశ్చాత్తాపంతో మంచి మనిషిగా, భక్తుడిగా మారిపోయాడు. లోక కల్యాణం కోసం రామాయణ మహా కావ్యాన్ని రాసిన వాల్మీకిమహర్షి, మొదట భయంకరమైన దారిదోపిడీ దొంగగా జీవనం సాగించినవాడన్న విషయం మరిచిపో కూడదు. సత్తెయ్య నిజంగానే భక్తుడిగా మారాడుగనక, తన సంపదను ధర్మ మార్గంలో వినియోగించ గలడన్న నమ్మ కంతో, భగవంతుడిపట్ల అపార విశ్వాసం గల వజ్రనాభుడు వాణ్ణి తన వారసుడిగా స్వీకరించాడు. ఇందులో ఆయన విచ క్షణా లోపంగానీ, మూర్ఖత్వం గానీ ఇసు మంత కూడా లేదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)





# శ్రీనివాస కల్యాణం



## త్రిమూర్తులకు పరీక్ష

శ్రీనివాసుడు అంటే శ్రీవేంకటేశ్వర స్వామి. ఆయనే శ్రీమహావిష్ణువు. ఆయన ఉండేది వైకుంఠంలో. వైకుంఠ మందిరాన్ని వదిలి పెట్టి ఆయన భూలోకానికి దిగివచ్చేశాడు. శ్రీనివాసుడు అనే పేరుతో తిరుమల క్షేత్రంలో ఉండిపోయాడు. విష్ణువు భూలోకానికి రావడానికి కారణమైన గాథ ఒకటి ఉంది...

అవి ద్వాపరయుగం ముగిసిపోయి, కలియుగం ప్రారంభమైన రోజులు. కలి యుగంలో అధర్మం పెచ్చుపెరిగి సుఖశాం తులు లోపించిపోతాయని భయపడ్డారు మహర్షులు. సుఖసంతోషాలతో అందరూ సహజీవనం సాగించాలన్న కోరికతో మహ ర్షులు విశ్వశాంతికోసం ఒక విశేషయాగం ప్రారంభించారు. ఆ విశేష క్రతువుకు కశ్యప మహర్షి ఆధ్వర్యం వహించాడు. గంగానదీ తీరంలో సాగుతున్న ఆ క్రతువులో మహ ర్షులు వేదమంత్రాలతో హవిస్సులను అగ్నికుండంలో వేల్చుతున్నారు. సువాస నలు వెదజల్లుతున్న హోమధూపం యాగ శాల ప్రాంగణమంతా వ్యాపించి, ఆకాశం వైపు దూసుకుపోసాగింది.

సరిగ్గా సమయానికి లోకసంచారం చేస్తూ అక్కడికి వచ్చాడు నారద మహర్షి. కశ్యపుడు, భృగువు, మొదలైన మహ ర్షులను నారదుడు పలకరించాడు. ''ఏ సంకల్పంతో యజ్ఞం చేస్తున్నారు?'' అని ప్రశ్నించాడు నారదుడు. ''ఇది విశ్వశాంతి కోరి చేస్తున్న విశేష క్రతువు'' అన్నారు మహర్షులు. ''ఆశయం గొప్పదే కానీ మీరు యాగంలో అర్పించే హవిస్సులను నైవే

పక్కాంతం సూర్యనారాయణ రావు



దేవతలతో మహా ఉత్తముడూ అయిన దేవుడే అందుకు తగినవాడు'' అన్నాడు నారదుడు. బ్రహ్మదేవుడే గొప్పవాడు అన్నారు మహర్షులలో కొందరు. ఇంకొందరు విష్ణువే గొప్పదేవుడు అన్నారు.శివుడే గొప్పదైవం అన్నారు మరికొందరు. ఈ అభిప్రాయభేదాలు మహర్షులలో వాదులాటకు దారితీశాయి. వాదులాట సిగపట్ల దాకా వెళ్లింది.

నారదుడు మహర్షులను వారించాడు. ''మీలో మీరు కలహించుకోవడం దేనికి? ఎవరో ఒకరు వెళ్లి త్రిమూర్తులను పరీక్షించి శుద్ధ సాత్విక దైవం ఎవరో తేల్చుకుంటే సరిపోతుంది కద!'' అన్నాడు.

నారదుని సూచన మహర్షులందరికీ నచ్చింది. త్రిమూర్తులను పరీక్షించడానికి ఎవరు వెళ్లాలా అనే విషయంలో వాళ్లమధ్య మళ్లీ భేదాభిప్రాయాలు తలెత్తాయి. నారదుడు మళ్లీ కల్పించుకుని ఇలా అన్నాడు. ''బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను పరీక్షించే శక్తీ, తెలివీ మీలో భృగు మహర్షికి మాత్రమే ఉన్నాయి. ఆయనను పంపించండి.''

మహర్షులు సరే అన్నారు. త్రిమూర్తులను జాగ్రత్తగా పరీక్షించి, నిగ్గుతేల్చి,ఆ ముగ్గురిలో గొప్పదేవుడెవరో నిర్ణయించి, యజ్ఞఫలాన్ని స్వీకరించి రమ్మని భృగు మహర్షిని పురమాయించారు. భృగు మహర్షి సమ్మతించి బయలుదేరాడు.

భృగు మహర్షి మొట్టమొదట బ్రహ్మదేవుణ్ణి పరీక్షించాలని తలిచాడు. మేరు పర్వత శిఖరం మీద ఉన్న సత్యలోకం చేరు

ద్యంగా స్వీకరించడానికి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో ఎవరిని ఆహ్వానించార''ని అడిగాడు. నారదుడు.

''ప్రత్యేకంగా ఎవ్వరినీ ఆహ్వానించలేదు. యాగం పూర్తయ్యేసరికి త్రిమూర్తులలో ఎవరో ఒకరు వస్తారు, యజ్ఞఫలం స్వీకరిస్తారు!'' అన్నారు రుషులు.

రుషుల అమాయకత్వం చూసి నవ్వుకున్న నారదుడు, ''చూశారా! కలియుగ ప్రభావం అప్పుడే మీమీద పనిచేస్తోంది. భక్తితో ఆహ్వానించకపోతే, త్రిమూర్తులలో ఎవ్వరూ రారు! పిలవని పేరంటానికి ఎవరైనా వస్తారా, చెప్పండి!'' అన్నాడు. త్రిమూర్తులు ముగ్గురూ తమకు కావలసినవాళ్లే. వాళ్లలో ఎవర్ని ఆహ్వానించాలా అనే ఆలోచనలో పడ్డారు మహర్షులు.

''యాగఫలం అందుకునే అర్హత అందరికీ ఉండదు. ఆవేశకావేషాలూ, కోపతాపాలూ లేని శుద్ధ సత్వ స్వరూపుడూ,

కున్నాడు. ఆయన వెళ్ళే సమయానికి వికసించిన తామరపువ్వు మీద కూచున్న బ్రహ్మదేవుడు తన నాలుగు ముఖాలతో తదేక ధ్యాసతో వేదపఠనం చేస్తున్నాడు. ఆయన పక్కనే శ్వేతపద్మం మీద కూచున్న సరస్వతీ దేవి వేదపఠనకు అనుగుణంగా వీణ వాయిస్తోంది. భృగుమహర్షి సరస్వతీ బ్రహ్మలను స్తోత్రం చేస్తూ వాళ్ళ కమలాసనాల చుట్టూ ప్రదక్షిణం చేశాడు. భక్తితో ప్రణామాలు అర్పించాడు. అయితే, అర మూసిన కళ్ళతో వేదసూక్తాలను పారాయణం చేస్తున్న బ్రహ్మ, తన్మయత్వంలో వీణ మీటుతున్న సరస్వతీ, భృగుమహర్షి రాకను గుర్తించనేలేదు. ఆయన వైపు కన్నెత్తి చూడలేదు. భృగుమహర్షిలో కోపం కట్టలు తెంచుకుంది. భక్తి ఆగ్రహంగా మారిపోయింది. బ్రహ్మదేవుడికి లోకంలో ఆలయమూ, అర్చనా లేకుండా ఉండేలా శపించి, వెనుదిరిగి వెళ్ళిపోయాడు. బ్రహ్మ, భృగువు శాపం గురించి పట్టించుకోకుండా తన వేద పఠనంలో నిమగ్నుడై ఉండి పోయాడు...

సత్యలోకం నుండీ భృగుమహర్షి తిన్నగా కైలాసం చేరుకున్నాడు. ఆయన వెళ్ళే సమయానికి కైలాస మందిరంలో పార్వతీ పరమేశ్వరులు ప్రణయతాండవం చేస్తూ మైమరిచి ఉన్నారు. భృగు మహర్షి బిగ్గరగా శివుడిని స్తుతించాడు. పరమశివుని చేతిలో ఢమరుకం సమ్మోహనకరంగా మోగుతోంది. పార్వతీదేవి కాలి అందెలు ఘల్లు ఘల్లున నినదిస్తున్నాయి. అర్ధాంగితో ప్రణయ తాండవం చేస్తూ పరవశంలో ఉన్న పరమేశ్వరుడి కళ్ళకు భృగుమహర్షి కనిపించలేదు. ఎవరినీ చూసే స్థితిలో





లేడు శివుడు! కైలాస మందిరానికి వచ్చిన తనను ఆహ్వానించే బాధ్యతను విస్మరించిన శివుడి ప్రవర్తన భృగుమహర్షిని కంపరమెత్తించింది. పరమశివుడి మూర్తికి కాకుండా లింగరూపానికి మాత్రమే అర్చనలు కలిగేలా ఘోరంగా శపించి, అక్కడినుంచి వెళ్లిపోయాడు.

సత్యలోకంలోనూ, కైలాసంలోనూ తనకు జరిగిన అవమానానికి కోపంతో దహించుకుపోతున్న భృగుమహర్షి చివరి గమ్యమైన వైకుంఠం చేరుకున్నాడు. అక్కడా ఆయనకు నిరాదరణే ఎదురైంది. ఆదిశేషుని పానుపు మీద హాయిగా పవళించిన శ్రీమహావిష్ణువు అర్ధనిమీలిత నేత్రాలతో, యోగనిద్రలో ఉన్నాడు. లక్ష్మీదేవి ఆయన పాదాలను వొత్తుతూ కూచుంది. ఆమె కూడా భృగువు రాకను గమనించలేదు.

వేళకాని వేళలో యోగ నిద్రలో ఉన్న విష్ణువును చూడగానే, భృగుమహర్షికి అరికాలి మంట నెత్తికెక్కింది. కోపంలో వివశుడైపోయిన భృగుమహర్షి ఉచితానుచితాలు పూర్తిగా మరిచిపోయాడు. దూకుడుగా ముందుకు వెళ్లి, కాలు పైకెత్తి శ్రీమహావిష్ణువు వక్షస్థలం మీద ఒక్క తాపు తన్నాడు. విష్ణువు దిగ్గున లేచి కూచున్నాడు. శ్రీమహాలక్ష్మి నివ్వెరపాటుతో బొమ్మలా ఉండిపోయింది.

విష్ణువు ఉలిక్కిపడి, యోగనిద్రనుండీ లేచి కూర్చున్నాడు. ఎదురుగా నిప్పులు కక్కుతూ ఊగిపోతున్న భృగుమహర్షిని చూసి పరిస్థితి గ్రహించాడు. శేషశయ్యనుంచి కిందికి దిగి వినయంగా నమస్కరించాడు. భృగు మహర్షికి స్వాగత వచనాలు పలికి, సగౌరవంగా ఉన్నతాసనం మీద ఆయనను ఆసీనుడిని చేశాడు. అనంతరం రెండు చేతులతో ఆయన పాదాలు ఒత్తుతూ ఇలా అన్నాడు.

''మహానుభావా! నా హృదయం వజ్రం కన్నా ఎనిమిది రెట్లు కఠినం! దానిని తాకిన మీ పాదం కందిపోయి ఉంటుంది! ఏదీ చూద్దాం...'' అంటూ భృగుమహర్షితో వినయంగా మాట్లాడుతూ శ్రీమహావిష్ణువు ఆయన పాదాలను కడిగాడు. పాదాలను సున్నితంగా తడుముతూ, అరికాల్లో ఉన్న మూడవకంటిని గిల్లివేశాడు.

భృగుమహర్షి అహంకారానికి కారణం ఆయన పాదంలోని మూడవ కన్ను! శ్రీమహావిష్ణువు తెలివిగా ఆ కంటిని గిల్లివేయగానే భృగువు అహంకారం

అంతరించింది. అతనికి జ్ఞానోదయం అయింది. శ్రీహరిని వక్షం మీద తన్ని తాను ఎంత అపరాధం చేశాడో తెలిసి వచ్చింది. విష్ణువు పాదాలమీద వాలి, క్షమించమని వేడుకున్నాడు.

‘‘నేను సకల ప్రాణులకు తండ్రిని. చిన్నారి కుమారుడు తన్నినంత మాత్రాన తండ్రికి కోపం వస్తుందా?’’ అన్నాడు విష్ణువు. దానితో శ్రీమహావిష్ణువు ఆగ్రహాలూ, ఆవేశాలూ లేని శుద్ధ సాత్విక స్వరూపుడైన దేవుడుగా గ్రహించాడు భృగుమహర్షి. విశ్వశాంతి కోసం తాము తలపెట్టిన క్రతువుకు విచ్చేసి, యజ్ఞఫలం స్వీకరించమని విష్ణువును ప్రార్థించాడు. విష్ణువు అంగీకరించి, భృగుమహర్షిని పంపించి వేశాడు.

తన నివాస స్థానమైన విష్ణు హృదయాన్ని తన్ని, అవమానించిన భృగుమహర్షి చర్య పట్ల శ్రీమహాలక్ష్మి అవమానంతో, కోపంతో దహించుకుపోయింది. అలాంటి సమయంలో భృగుమహర్షికి తన నాథుడు చేసిన మర్యాదలూ, సపర్యలూ ఆమెకు మరింత ఆగ్రహాన్ని తెప్పించాయి. భృగుమహర్షి తమ అతిథి అనీ, ఆయనను ఆదరించి అతిథి సత్కారాలు అందచేయడం తమ విధి అని చెప్పి లక్ష్మిని ఓదార్చే ప్రయత్నం చేశాడు విష్ణువు.

‘‘ఆ అహంకారి తన్నింది మీ హృదయాన్ని కాదు. నా నివాసస్థానాన్ని. ఇప్పుడు మీ హృదయం మీది కాదు, నాది. ఆ భృగువు అవమానించింది మిమ్మల్ని కాదు. నన్ను. నాకు అవమానం జరిగిన వైకుంఠంలో నేను క్షణం కూడా ఉండను!’’ అంటూ ఆగ్రహించింది లక్ష్మి.

తన అర్థాంగిని శాంతింప చేయడానికి విష్ణువు శతవిధాలా ప్రయత్నించి. ‘‘సకల ప్రాణులూ మనసంతానమే. నువ్వు తల్లివి. నేను తండ్రిని. భృగువు కూడా నీ బిడ్డడే! తల్లికి కోపం తగదుకదా!’’ అన్నాడు.

‘‘నేను రత్నగర్భుడైన సముద్రుడి కుమార్తెను. అవమానాలను సహించని ఆత్మాభిమానం నాది. వైకుంఠంలో ఇక ఉండలేను.’’ అంటూ లక్ష్మి అలిగి ఆవేశంలో వెళ్లిపోయింది. – (ఇంకా ఉంది)





# పంచతంత్ర కథలు



యుక్తితో కుందేలు క్రూరమైన సింహాన్ని చంపిన కథ దమనకం చెప్పగా విని, కరటకం, ''ఇలాంటి యుక్తులు ఎల్లప్పుడూ పారుతాయని ఎలా చెప్పగలవు?'' అని అడిగింది.

''మనం ప్రమాదాలకు సిద్ధపడాలి. లేకపోతే లాభం పొందలేం. ధైర్యవంతుడికి దేవతలు కూడా తోడ్పడతారు. సాలెవాడు సాహసంతో విష్ణువుపాత్ర ధరించబట్టే గదా మహా సౌందర్యవతి అయిన రాజకుమార్తెను పొందగలిగాడు?'' అన్నది దమనకం.

''అదెలాగ?'' అని కరటకం అడిగింది. ఆ కథను దమనకం ఇలా చెప్పింది:

### సాలెవిష్ణువు కథ

వంగదేశంలోని పుండ్రవర్ధనం అనే నగరంలో ఆప్తమిత్రులైన ఒక సాలెవాడూ, వడ్రంగీ ఉండేవారు. వాళ్లు తమ వృత్తులలో గొప్ప నిపుణులు కావడం చేత, అధిక సంపాదనలు కలిగి, అందమైన భవంతులతో నివసిస్తూ, డబ్బును మంచినీటిలాగా ఖర్చు చేసేవారు. సువాసనలు గల పూలు ధరించి అత్తరువులు పూసుకుని, సుగంధ తాంబూలాలు సేవించేవారు.

ఒకసారి ఒక గొప్ప ఉత్సవం జరిగింది. వేడుకలు జరిగే ప్రతి స్థలానికీ జనం అందమైన దుస్తులు ధరించి తండోపతండాలుగా వస్తున్నారు.

సాలెవాడూ, వడ్రంగీ కూడా చక్కగా అలంకరించుకుని బయలుదేరారు. అక్కడ వాళ్లు ఉత్సవం జరిగే ప్రతిచోటికీ తిరిగి ఆనందిస్తూ, ఇతరులు చేసుకున్న అలంకరణలను పరిశీలించసాగారు.

ఒక మహా భవనం గవాక్షంలో రాజకుమార్తె సుదర్శన చెలికత్తెలను వెంట ఉంచుకుని వారి కళ్లబడింది. ఆమె నవయౌవనంలో ఉన్న అపురూప సౌందర్యవతి. ఆమెను చూస్తూనే సాలెవాడు తీవ్రమైన మోహానికి గురి అయినాడు. అతను తన వికారాన్ని ఎలాగో బయటపడకుండా దాచుకుని, ఇంటికి తిరిగి వచ్చాడు. కాని, తన ఇంట్లో ఒంటరిగా ఉన్నప్పుడు ఎటు చూసినా రాజకుమార్తె రూపమే కనబడసా

మిత్రభేదం - 10



గింది. అతను ఎంతో విచారంగా మంచం మీదపడి, ఆమెనే ధ్యానిస్తూ పడుకున్నాడు.

అతను, తనస్థితిని గురించి ఆలోచిస్తూ, ''అందం ఉన్న చోట మంచితనం కూడా ఉంటుందంటారు గదా, ఈ అందగత్తె నన్ను ఎందుకిలా బాధిస్తున్నది? రాజ కుమార్తె నా హృదయంలో తిష్టవేసుకుని, దాన్ని ఎందుకు దహిస్తున్నది? దేవుడు నా ప్రాణం తీయదలిస్తే అందుకు మరేదన్నా సాధనం చూడక ఈమెను ఎందుకు ఉప యోగించుకున్నాడు? ప్రపంచంలో ప్రతిదీ క్షణికమేనని బుద్ధుడు చెప్పిన మాట నిజం కాదు. నిజమైతే, రాజకుమార్తె మీద నాకు కలిగిన మోహం పోదే?'' అనుకున్నాడు.

ఇలా ఆలోచనలతో సాలెవాడు ఆ రాత్రి అంతా జాగరణ చేశాడు. మర్నాడు అదే వేళకు వడ్రంగి అతన్ని చూడటానికి చక్కగా అలంకరించుకుని వచ్చి తన మిత్రుడు మంచం పై శవంలాగా పడిఉండటం చూసి "మిత్రమా నీకేమయింది?" అని అడిగాడు.

సాలెవాడు నిట్టూర్పులు విడిచాడే గాని జవాబు చెప్పలేదు. వైద్యం కొంత తెలిసిన వడ్రంగి తన స్నేహితుడి నాడి పరీక్షించి, నుదురు తాకి చూసి, ''మిత్రమా, నీది ప్రేమజ్వరం లాగుంది. ఎవతెను ప్రేమిం చావు?'' అని అడిగాడు.

సాలెవాడు ఆశ్చర్యంతో లేచి కూర్చుని, ''బాధను ప్రేమించిన భార్యతో గాని మిత్రుడితో గాని పంచుకుంటే తగ్గుతుం దంటారు,'' అంటూ తనలోని బాధను బయటపెట్టాడు. వడ్రంగి అంతా విని, ''సుప్రతివర్మ మహారాజు క్షత్రియుడు, నువ్వు వైశ్యుడివి. నీ కన్న గొప్ప కులానికి చెందిన స్త్రీని కోరటానికి నీకు జంకులేదా?'' అని అడిగాడు.

''క్షత్రియుడు క్షత్రియ, వైశ్య, శూద్ర కన్యలను వివాహం ఆడవచ్చు. ఆమె రాజుకు వైశ్య భార్య వల్ల పుట్టినదే అయి ఉంటుంది. లేకపోతే నాకు ఆమె పైన ప్రేమ కలిగి ఉండదు. ఇటువంటివాటికి అంతరాత్మే సాక్షి!'' అన్నాడు సాలెవాడు.

''ఇప్పుడు ఏం చేయాలి?'' అని అడి గాడు వడ్రంగి.

''నాకు చితి సిద్ధం చెయ్యి. నాకు రాజ కుమార్తె లభించడం అసంభవం. ఆమె లభించకపోతే నేను బతకటం అసంభవం. అంతులేని శరీర బాధా, మనోవేదనా అను భవించి నేను చావక తప్పదు.'' అన్నాడు సాలెవాడు.

''అదంతా కట్టిపెట్టు. ధనంతోగాని, బుద్ధితోగాని సాధించరానిది ప్రపంచంలో ఏదీ లేదు. లేచి, స్నానం చేసి, భోజనం

చేసి మామూలుగా ఉండు. నీకు రాజ కుమార్తె దక్కే వైనం నేను ఆలోచిస్తాను,'' అన్నాడు వడ్రంగి.

తన మిత్రుడి తెలివితేటలలో అపార మైన విశ్వాసం ఉండటం చేత సాలెవాడు విచారం కట్టిపెట్టి, మామూలు ప్రకారం జీవించసాగాడు. కొద్ది రోజుల అనంతరం, వడ్రంగి సాలెవాడి వద్దకు గరుడ రూపంలో విమానాన్ని తెచ్చాడు. అది చక్కగా రంగులు వేసి ఉన్నది. దాన్ని నడపటానికి ఒక కాడ ఉన్నది. అలాంటి విమానాన్ని పూర్వం ఎన్నడూ ఎవరూ చూసి ఉండరు.

దాన్ని ఎలా నడపాలో సాలెవాడికి చెబుతూ, ''పైకి లేచి ఎగురుతూ వెళ్లా లంటే, ఈ కాడను బయటకు లాగు. కిందికి దిగి ఆగదలిస్తే కాడను లోపలికి నొక్కెయ్యి,'' అన్నాడు వడ్రంగి.

సాలెవాడు ఆ గరుడ విమానాన్ని నడ పడం పూర్తిగా నేర్చుకున్నాడు.

''సుప్రతివర్మ మహారాజూ, ఆయన కుటుంబమూ, ముఖ్యంగా రాజకుమార్తె సుదర్శనా, నారాయణుడి భక్తులు. వారి పూర్వీకుడు ఒకడికి నారాయణుడు ప్రత్య క్షమై, వరాలు ఇచ్చినట్టు కూడా చెప్పుకుం టారు. నువు శంకు, చక్ర, గదా, పద్మాలు ధరించి, ఈ గరుడ విమానంపై వెళ్లి, రాజ భవనం పైభాగాన వాలు. అక్కడే రాజకు మార్తె శయన మందిరం ఉన్నదనీ, అక్కడ ఆమె ఒంటరిగా పడుకుంటుందనీ నేను తెలుసుకున్నాను. నువు నారాయణుడి లాగా నటిస్తూ, గాంధర్వ విధిని ఆమెను నీ భార్యను చేసుకో,'' అన్నాడు వడ్రంగి.

ఆ పగలల్లా సాలెవాడు ఆనందంగా ఊహలలో విహరించి, రాత్రి పడగానే ఖరీ దైన పట్టుబట్టలు కట్టుకుని, సుగంధ లేప నాలు ఒంటికి పూసుకుని, శంఖు చక్ర గదా పద్మాలు వెంటబెట్టుకుని గరుడ వాహనం ఎక్కి, తిన్నగా వెళ్లి, రాజకుమార్తె శయన మందిరం ముందు డాబామీద వాలాడు.

అది పండు వెన్నెల రాత్రి. రాజకుమార్తె పంచలో మంచం మీద పడుకుని, అకస్మా త్తుగా నారాయణుడి తనకు సమీపంలో గరుడవాహనం మీద చూసింది. సాలెవాడి రూపం నారాయణుడిని వర్ణనకు తగినట్లే ఉన్నది. ఆమె చప్పున లేచి, సాలెవాడి ముందు సాష్టాంగపడి, ''స్వామీ, నాపైన అనుగ్రహంతో ఇలా రావడానికి కారణం ఏమిటి?'' అని అడిగింది.





# రాజు - ప్రజలు



వీరగుప్తుడు పాలిస్తున్న విజయపుర రాజ్యంలో అరాజకపరిస్థితులు ఏర్పడినై. ఎంత ఆలోచించినా అందుకు కారణాలు అంతుచిక్కక, చివరకు పొరుగు రాజ్యమైన చంపకదేశానికి ఒకసారి వెళ్ళి రావాలను కున్నాడు వీరగుప్తుడు.

చంపకదేశం సుభిక్షంగా ఉంటున్నదనీ, అందుకు కారణం ఆ దేశపు రాజు ధీరసేనుడనీ అంతా చెప్పుకుంటూం డేవారు.

ధీరసేనుడు తన రాజ్యంలో ఏం చేస్తున్నాడో చూడడం కోసం, వీరగుప్తుడు వెళ్ళి ఆయనను కలుసుకున్నాడు.

ధీరసేనుడు, ఆయనకు ఘనంగా స్వాగతం పలికి, వచ్చినపని తెలుసుకుని, ''ఏ దేశం అభివృద్ధి అయినా, ఆ దేశంలోని ప్రజల మీద ఆధారపడి వుంటుంది. నా దేశం సుభిక్షంగా వున్నదంటే, అందుకు కారణం, నా ప్రజలే!'' అన్నాడు.

ఈ మాటలు విన్నాక వీరగుప్తుడికి మనసులో కొంత తప్తి కలిగింది. తన దేశంలో అరాజకానికి కారణం తను కాదు. తన ప్రజలు, అందువల్ల, చంపకదేశ ప్రజల గొప్పతనం తెలుసుకోవాలనిపించింది వీరగుప్తుడికి.

''దానిదేముంది! మారువేషంలో ఇద్దరం దేశసంచారం చేద్దాం.'' అన్నాడు ధీరసేనుడు.

ఇద్దరూ బయలుదేరి చంపకదేశంలో చాలా ప్రాంతాలు తిరిగారు. ప్రతిచోటా ధీరసేనుడికి గొప్పగా స్వాగతమూ, ఎంతో ఘనంగా మర్యాదలూ జరిగినై.

ఇది చూసి వీరగుప్తుడికి చాలా ఆశ్చర్యం కలిగింది.

ఆయన ఒకడిని కలిసి, ''మీ రాజు మారువేషంలో వున్నాడు కదా, అయినా ఎలా గుర్తుపట్టగలుగుతున్నారు?'' అని అడిగాడు.

వసుంధర



‘‘రాజుగారి పట్ల మా హృదయాల్లో ఎనలేని భక్తిగౌరవాలున్నవి. ఆ కారణంగా ఆయన ఏ మారువేషంలో వున్నా, మేము చాలా సునాయాసంగా గుర్తుపట్టగలం,’’ అన్నాడు వాడు.

ఈ సమాధానం విని వీరగుప్తుడు మరింతగా ఆశ్చర్యపోయాడు.

ఈ పర్యటనలో ధీరసేనుడు కొన్ని చోట్ల తనకు నచ్చిన వస్తువులు కొనుక్కోవాలని చూశాడు. కాని వర్తకులు ఆయన వద్ద డబ్బు తీసుకోక, ‘‘మా రాజుగారికి వీటిని కానుకగా ఇస్తున్నాం. రాజుకూ, ప్రజలకూ మధ్య వ్యాపారం వుండకూడదు,’’ అన్నారు.

దేశ సంచారం ముగిసిన తరవాత వీరగుప్తుడు, ధీరసేనుడితో, ‘‘నిజంగానే మీ ప్రజలు గొప్పవారు. నా ప్రజలు వారి నుంచి నేర్చుకోవలసి వున్నది,’’ అని తన దేశానికి తిరిగి వెళ్లాడు.

ఒకనెల రోజులు గడిచాక ఆయన, తన ప్రజల తీరుతెన్నులెలా వున్నదీ తెలుసుకునేందుకు మారువేషంలో దేశ సంచారం ప్రారంభించాడు. ప్రజలెవ్వరూ వీరగుప్తుడిని గుర్తించలేదు. ఒకచోట ఆయన ఒక వస్తువు బేరం చేసి, వ్యాపారి మరీ ఎక్కువ ధర చెబుతున్నాడని భావించి, ‘‘నేనీ దేశపు రాజునని తెలిస్తే, ఇంత ధర చెబుతావా?’’ అన్నాడు. ఇలా అన్న తరవాత కూడా వ్యాపారి, రాజును గుర్తుపట్టక, ‘‘మహారాజుగారికైతే ఇంత స్వల్ప ధర చెప్పను. ఇంకా ఎక్కువ చెబుతాను,’’ అన్నాడు.

వీరగుప్తుడికి ఏమనేందుకూ పాలుపోలేదు. రాజుకూ ప్రజలకూ మధ్య వ్యాపారం ఉండకూడదని చంపకదేశ ప్రజలు చెప్పిన మాటలు ఆయనకు శూలాల్లా తగిలాయి. పైగా తానెవరో స్పష్టం చేసినప్పటికీ ఆ వ్యాపారి తనను గుర్తు పట్టక పోవడం మరీ బాధించింది.

ఆయన దేశసంచారం ముగించి, నగరానికి తిరిగి వచ్చాడు. తరవాత మంత్రులను సమావేశపరిచి, వాళ్లకు తన అనుభవాలు చెప్పి, ‘‘ఇటువంటి ప్రజలున్న దేశానికి రాజును కావడం, నా దురదష్టం. మన ప్రజలు చంపకదేశ ప్రజల్లా మారాలంటే, ఏం చేయాలో మీరే చెప్పండి,’’ అన్నాడు.

మంత్రులు తమలో తాము చర్చించుకుని, ‘‘ప్రభూ, రాజుగా మీరు పొరుగు దేశం వెళ్లి వచ్చారు. ప్రజలనుంచి కూడా కొందరిని ఎన్నిక చేసి, వాళ్లను చంపక



దేశంలో కొన్నాళ్లుండి రమ్మనడం బావుం టుందని, మా అభిప్రాయం,'' అన్నారు.

మంత్రుల సూచన వీరగుప్తుడికి నచ్చింది. వెంటనే దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి నూరుమంది ప్రతి నిధులు ఎన్నిక చేయబడ్డారు. వాళ్లను చంపకదేశంలో రెండు మాసాలపాటు వుండి రావలసిందిగా ఆయన ఉత్తరువు జారీ చేశాడు. ఇందుకు చంపకదేశ రాజు ధీరసేనుడి అనుమతి కూడా లభించింది.

రెండు నెలలు గడిచాక, రాజు పంపిన ప్రతినిధులు తిరిగి వచ్చారు. రాజు వాళ్ల అనుభవాల గురించి అడిగాడు.

''ఏ దేశం అభివృద్ధి పొందాలన్నా, అందుకు సరి అయిన నాయకుడుం డాలి. చంపకదేశపు రాజు ధీరసేనుడు అసమాన ప్రజ్ఞాశాలి!'' అన్నారు వాళ్లు.

వీరగుప్తుడు ఈ మాటలు వింటూనే, కోపం తెచ్చుకుని, ''ధీరసేనుడే నాతో చెప్పాడు- తన దేశం ఏ అరాజకాలూ లేకుండా సుభిక్షంగా వున్నదంటే అందుకు కారణం తన ప్రజలే కాని, తను కాదని!'' అన్నాడు.

''ఆయన దేనికీ, తనను తాను పొగడు కోడు. ప్రజలను కన్నబిడ్డల్లా ప్రేమిస్తూ, అన్ని గొప్పతనాలూ వారికే అంటకడ తాడు,'' అన్నారు ప్రతినిధులు.

వీరగుప్తుడు ఒకటి, రెండు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, ''ఏ వేషంలో వున్నా తమ రాజును గుర్తుపడతారు చంపకదేశ ప్రజలు. అసలు వేషంలో కూడా, రాజును గుర్తుపట్టలేని ప్రజలు, మనదేశంలో చాలా మంది వున్నారు. దీనికేమంటారు?'' అన్నాడు.

''ప్రభూ, గౌతమబుద్ధుడి బొమ్మ ఎక్కడ కనబడినా, అందరూ గుర్తుపడ తారు. ఇందుకు కారణం బుద్ధుడి గొప్ప తనమే కాని, ప్రజల గొప్పతనం కాదు గదా,'' అన్నారు ప్రతినిధులు.

ప్రతినిధులు చెప్పే మాటల్లో ఏదో అంతరార్థమున్నదని గ్రహించిన వీరగు ప్తుడు, కాస్త చల్లబడి ''మీరు చెప్పదలు చుకున్నదేమిటో సూటిగా చెప్పండి,'' అన్నాడు.

దానికి ప్రతినిధులు ఎంతో విన యంగా, '''ధీరసేనుడు ప్రజల గురించి తప్ప ఇంకేమీ ఆలోచించడు. ఆయనకు విలాస జీవితం మీద ఆసక్తి లేదు. తన విలాసాల కోసం కాక, ప్రజల అవసరాలు తీర్చేందుకే పన్నులు వేస్తాడు. ఆయనకు

ప్రజలపై పూర్తి విశ్వాసం వున్నది. అందు వల్లనే వాళ్లమీద ఎటువంటి అంక్షలూ విధించలేదు. కాబట్టే ప్రజలకు కూడా తమ రాజుపట్ల అంతటి విశ్వాసం ఉంది. అటువంటి రాజు పరిపాలకుడిగా వుంటే, ఏ ప్రజలైనా అలాగే వుంటారు,'' అన్నారు.

వీరగుప్తుడికి కనువిప్పయింది. తన ప్రజలు చంపకదేశ ప్రజలను ఆదర్శంగా తీసుకోవాలంటే, మొదటగా తను చంపక దేశం రాజు ధీరసేనుడిని ఆదర్శంగా తీసుకోవాలన్న మాట!

''నేను ధీరసేనుడిని ఏనాడో ఆదర్శంగా తీసుకున్నాను. ఇంకా నాలో ఏ లోపం వున్నది?'' అని అడిగాడు వీరగుప్తుడు.

''మీరు అలా చేసి వుంటే, ఆయనకు మీ ప్రజలను గురించి ఆ రోజే గొప్పగా చెప్పి వుండేవారు. కాని- ఇలా అంటున్నందుకు మమ్మల్ని క్షమించాలి, మీ అసమర్థతను ప్రజలపై నెట్టివేయాలని చూశారు. అందువల్ల, చంపకదేశంలో మన ప్రజలను గురించి చాలా చెడుగా చెప్పుకుంటున్నారు. సాక్షాత్తూ దేశాధినేతకే తన ప్రజల పట్ల విశ్వాసం లేకుంటే వారిని పొరుగుదేశ ప్రజలు ఎలా గౌరవిస్తారు, మీరే ఆలోచించండి,'' అన్నారు ప్రతినిధులు.

వీరగుప్తుడు ఆలోచనలో పడ్డాడు. తర్వాత వాళ్లను పంపివేసి, మంత్రులను పిలిచి, సమాలోచన జరిపాడు. చివరికి ఇలా ముగిస్తూ, ''తప్పంతా మనది! మన ప్రజల్లో లోపాలుంటే, వాటిని సరిదిద్ద వలసిన బాధ్యత మనపైన వుంటుంది. ఆ బాధ్యతను సక్రమంగా నిర్వహించడం చేతకాకపోతే నేను రాజుగానూ, మీరు మంత్రులుగా ఉండడానికి అర్హులం కాదు,'' అన్నాడు.

ఈ సత్యం తెలుసుకున్న తరవాత, వీరగుప్తుడి పాలన మౌలికంగానే మార్పులకు గురయింది. తర్వాత కొద్ది కాలానికే విజయపుర దేశప్రజలు కూడా, క్రమంగా చందనదేశపు ప్రజలలాగే మారిపోయారు. కొసమెరుపుగా రాజ్యంలోని ప్రజలు వీరగుప్తుడిని మారువేషంలోనూ సులువుగా గుర్తుపట్టగలిగారు. రాజు కూడా మారువేషంలో తనతో బేరమాడగల వారిని చూడలేకపోయాడు.





# యోగ్యతా పరీక్ష



రమాపతికి సువర్చల ఒక్కతే కూతురు. చిన్నతనంలోనే తల్లిని కోల్పోయిన ఆమెను ఎంతో ముద్దుగా పెంచి పెద్ద చేశాడు. ఇప్పుడు సువర్చలకు పెళ్ళీడు వచ్చింది. రమాపతి తగిన పెళ్లి సంబంధాల కోసం ప్రయత్నాలు ప్రారంభించాడు.

ఒకనాటి సాయంకాలం, ఆయనకు పొరుగు గ్రామంలో ఉన్న బాల్యమిత్రుడి నుంచి ఒకసారి వచ్చిపోవలసిందిగా కబురు వచ్చింది. రమాపతి బయలుదేరుతూ కూతురుకు తగు జాగ్రత్తలు చెప్పి, ''రేపు ఉదయాన్నే బయలుదేరి వస్తాను. రాత్రికి మరచిపోక తలుపులన్నీ లోపల గడి వేసుకుని పడుకో'' అని హెచ్చరించాడు.

''నువ్వేమీ అదుర్దాపడక, వెళ్ళిరా నాన్నా. నేనేమంత చిన్నపిల్లను కాదులే'' అని సువర్చల తండ్రిని సాగనంపింది. అర్థరాత్రివేళ ఆమెకు చిన్నగా కునుకు పడుతూండగా, వీధి తలుపునెవరో గట్టిగా తట్టిన శబ్దం అయ్యింది. ఇంత రాత్రివేళ వచ్చింది ఎవరా అనుకుంటూ సువర్చల పక్కన ఉన్న కిటికీ తెరిచి బయటికి చూసింది. సన్నగా పడుతున్న వానలో తడుస్తూ ఒక ముసలివాడు తలుపు పక్కన నిలబడి ఉన్నాడు.

సువర్చల తలుపు తెరవడం చూస్తూనే ముసలివాడు, ''ఈ రాత్రికి తల దాచుకునేందుకు చోటిచ్చి పుణ్యం కట్టుకో, తల్లీ. ఊరుకాని ఊరు. పైగా వాన. ఒంట్లో నలతగా ఉన్నది'' అన్నాడు.

సువర్చలకు అతనిమీద జాలి కలిగి వెంటనే తలుపుతెరిచి, ''లోపలికి రా, తాతా!'' అన్నది.

ముసలివాడు లోపలికి వచ్చాడు. ఆమె ఒక పొడిబట్ట ఇచ్చి, ఒళ్ళు తుడుచుకోమని చెప్పింది. అతడు ఒళ్ళు తుడుచుకుంటూ చుట్టూ కలియజూసి, ''ఇంత రాత్రివేళ

25 ఏళ్ళనాటి చందమామ కథ

ఇంట్లో ఒక్కతెవేనా?'' అని అడిగాడు. ఆమె తన తండ్రి పొరుగూరు వెళ్ళినవైనం చెప్పి, ''మొహమాటపడకు తాతా. రాత్రి భోజనం చేశావా?'' అని అడిగింది.

అతడు తలవంచుకుని, చేయలేద న్నట్టు ఆడించాడు. ఆమె అతడికి అప్పటి కప్పుడు తాను తినగా మిగిలిన అన్నం, కూరలూ వడ్డించింది. ముసలివాడు కాస్సేపటిలో తృప్తిగా తిని లేచాడు.

సువర్చల ముందుగదిలోకి పోయి అక్కడ చాపపరిచి పడక తయారు చేస్తుండగా, హఠాత్తుగా ఆమెకేసి ఒక పదునైన కత్తిని చూపిస్తూ, ''మర్యాదగా ఇంట్లో ఉన్న నగలూ, డబ్బూ మూటకట్టి ఇవ్వు. ఏదైనా తెగింపు చేయబోయావో నీ ప్రాణానికే ముప్పు'' అన్నాడు కఠినంగా.

ఊహించని ఈ పరిణామానికి సువ ర్చల నిర్ఘాంతపోయి, అంతలోనే తెప్పరిల్లి ''ఆశ్రయం ఇచ్చినవాళ్ళకే ద్రోహం తలపె ట్టావా..'' అన్నది. ముసలివాడు పళ్ళుకొరు కుతూ ''ఇదొకపెద్ద ఆశ్రయం ఇవ్వడమా? తలుపు తెరవకపోతే బద్దలుకొట్టి ఉండే వాడిని. ఊసుపోని కబుర్లు చెప్పకుండా ముందు డబ్బూ, నగలూ ఎక్కడున్నాయో చూసి, మూట కట్టుకురా'' అన్నాడు.

సువర్చల ఏ మాత్రం భయపడక ''భోజనం అయితే పెట్టాను గానీ, డబ్బు కూడా మూటకట్టి ఇవ్వమంటే ఇవ్వను. అదుగో, ఆ గదిలో ఉన్న పెట్టెలోనివన్నీ మూట గట్టుకుని, నీ దారిన వెళ్ళు'' అన్నది. ముసలివాడు వెంటనే ఆమె



చూపిన గదిలోకి వెళ్ళాడు. సువర్చల మెరుపులా వాడి వెనకాలే వెళ్ళి, తలుపు లాగి బయట గడి పెట్టేసింది. ముసలి వాడు ఒకటి రెండు క్షణాలాగి గట్టిగా అరుస్తూ తలుపుమీద బాదసాగాడు.

ఆ అర్ధరాత్రివేళ ఈ ముసలి వెధవను పట్టుకునేందుకు ఇరుగు, పొరుగులకు నిద్రాభంగం కలిగించటం ఎందుకు? తెల్లవారాకే ఆ పని చేయవచ్చునుకుని సువర్చల తన గదిలోకి వెళ్ళి పడుకుంది.

తెలవారుతుండగా ఎవరో తలుపు కొట్టిన శబ్దమై సువర్చలకు మెలకువ వచ్చింది. తన తండ్రి తిరిగి వచ్చాడను కుంటూ వెళ్ళి తలుపు తెరిచింది. గడప ముందు ఖరీదైన దుస్తులు ధరించి, నాజూ కుగా ఉన్న యువకుడొకడు నిలబడి ఉన్నాడు. సువర్చల అతడిని చూసి, ''ఎవరి కోసం వచ్చారు?'' అని అడిగింది. దానికి యువకుడు చిరునవ్వు నవ్వుతూ,



ఇలా చెప్పాడు: "నా పేరు మోహనరంగం. వారం క్రితం నా స్నేహితుడి ఇంట జరిగిన ఒక వివాహసమయంలో, అక్కడికి వచ్చిన నిన్ను చూశాను. నీ అందం, మాటతీరూ నన్ను ఆకర్షించాయి. అయితే, లక్షాధికారులకు ఏకైక సంతానం అయిన నాతో, వివాహం ఆడే యోగ్యత నీకున్నదా? అన్న సందేహం కలిగింది. యోగ్యతా పరీక్ష కోసం మీ తండ్రి ఇంటలేని సమయం చూసి, మా ఇంటి పనివాడితో ఈ నాటకం ఆడించాను," అన్నాడు యువకుడు.

అంతా విని ఆశ్చర్యపడుతున్న సువర్చలతో, "ఈ యోగ్యతా పరీక్షలో నువ్వు నూటికి నూరుపాళ్ళు నెగ్గావు" అన్నాడు ఎంతో సంతోషంగా.

"అదెలా..?" అన్నది సువర్చల.

యువకుడు రంగస్థల నటుడి ధోరణిలో "ముసలివాడిని ఆదరించటం ద్వారా నీ ఉదారత్వం, కత్తి చూపించినా భయపడక పోవడంలో నీ ధైర్యం, వాడిని బంధించటంలో నీ తెలివితేటలూ చక్కగా నిరూపించబడ్డాయి. నా భార్యవు కాదగ్గ యోగ్యత నీకున్నది. నిన్ను పెళ్లాడడానికి నాకెలాంటి అభ్యంతరాలూ లేవు" అన్నాడు.

"పనివాడిచేత ఇంత నాటకం ఆడించిన మీరు, స్వయంగానే నాటకాలాడి మరిన్ని లక్షలు గడించవచ్చు" అంటూ సువర్చల పోయి, ముసలివాడున్న గది తలుపు తెరిచింది. వాడు కళ్ళు నలుపుకుంటూ బయటికి వచ్చి, తన యజమానికి కాస్త వెనుకగా నిలబడ్డాడు.

"వానలో ఒక ముసలాడు ఆశ్రయం కావాలంటూ మీ ఇంటికి వచ్చాడా..?" అని ప్రశ్నించాడు.

"అవును, వచ్చాడు. ఆశ్రయం ఇచ్చి ఇంత భోజనం పెట్టిన నాకే కత్తి చూపించి, డబ్బు ఇవ్వమని బెదిరించాడు. వాణ్ణి ఈ పక్క గదిలో పెట్టి గడి బిగించాను. సరే, ఇంతకూ ఆ దొంగతో మీకేంపని?" అని అడిగింది సువర్చల.

యువకుడు పెద్దగా నవ్వి, "వాడు దొంగ కాదు; మా ఇంట్లో పనివాడు" అన్నాడు. "మీ ఇంట్లో పనివాడు, మా ఇంటికి దొంగతనానికి వస్తే, వాడు దొంగ కాకమరేం అవుతాడు?" అని ప్రశ్నించింది సువర్చల కోపంగా. సువర్చల కొంత కోపంగా ప్రశ్నించినా, యువకుడు ఇంకా చిరునవ్వుతోనే, "వాడు నిజంగా దొంగతనానికి రాలేదు. ఇదంతా ఒక చిన్న నాటకం" అని, ఆమెకు సంగతంతా

అప్పుడు సువర్చల యువకుడితో ''మోహనరంగంగారూ, నాకు యోగ్యతా పరీక్ష పెట్టడం, ఫలితం నిర్ణయించటం.. రెండూ బుద్ధిమాలిన పనులు. ఇలాంటి వెర్రి మొర్రి పరీక్ష పెట్టిన మిమ్మల్ని రక్షక భటులకు అప్పజెప్పకుండా వదిలిపెడు తున్న నా ఉదారత్వం, ఇంత లక్షాధికారిని తక్షణం వెళ్ళకపోతే మర్యాద దక్కదని చెప్పడం బట్టి నా ధైర్యం, మిమ్మల్ని సపే మిరా పెళ్ళాడనని చెప్పడంలో నా తెలివి తేటలూ.. మీరే అంచనా వేసుకోండి. ఒకరికి పరీక్ష పెట్టడానిక్కూడా యోగ్యత ఉండాలని తెలుసుకోండి. ఇక ఇక్కడి నుంచి కదలండి'' అన్నది కోపంగా వీధి ద్వారం కేసి చేయి చూపుతూ. ఆమె ఇలా అనగానే యజమానీ, నౌకరూ వెలవెల బోతూ తలలు దించుకుని, ద్వారానికి కొంత ఎడంగా నిలబడి ఉన్న సువర్చల తండ్రిని తప్పుకుని బయటికి వెళ్ళిపోయారు.

అంతా విన్న ఆమె తండ్రి లోపలికి వస్తూ.. ''తల్లీ.. అంత తొందరపడ్డావెం దుకు? అంత డబ్బున్నవాడు కోరి చేసు కుంటానని వస్తే, చీవాట్లు పెట్టడమా..!'' అన్నాడు. ''అతడికి డబ్బున్నదన్న ధీమా కొద్దీ తన ఇష్టంతో తప్ప, నా ఇష్టాయిష్టా లతో పనిలేదనుకుంటున్నాడు. నచ్చాను కాబట్టి పరీక్ష పెట్టేశాడు. ఆ రకం మను షులు డబ్బుతో దేన్నయినా కొనివేయగల మనుకుంటారు'' అన్నది సువర్చల.

సువర్చల తండ్రి ఆలోచిస్తూ ఊరుకుని, ''నా బాల్య స్నేహితుడు రామభద్రయ్యా, అతడి కొడుకు ప్రభాకరం నీకు తెలుసు గదా?'' అని అడిగాడు. ''తెలియకేం'' అన్నది సువర్చల.

''నేను వెళ్ళింది వాళ్ళ ఇంటికే. రామ భద్రయ్య నిన్ను, తన ఇంటి కోడలుగా చేసుకోవాలనుకుంటున్నాడు. ఇందుకు, నీ అభిప్రాయం తెలుసుకోవాలన్నది అతడి కోరిక. ప్రభాకరం యోగ్యుడు, కష్టజీవి. ఉన్న నాలుగెకరాలలో బంగారం పండిస్తున్నాడు. అతణ్ణి చేసుకోవడం, నీ కిష్టమేనా?'' అని అడిగాడు రమాపతి.

ఇష్టమే అన్నట్లు సువర్చల చిరు నవ్వుతో తలాడించింది. తన చిన్ననాటి స్నేహితుడు వియ్యంకుడు కాబోతున్నం దుకు రమాపతి చాలా సంతోషించాడు.



# శిథిలాలయం - 6




(రాకాసిబొమ్మ ప్రమాదం నుంచి బయటపడి, శిఖిముఖీ, విక్రమకేసరీ కొండగుహల కేసి పోయేంతలో, తిమ్మగూడెం పల్లెలో సవరగండుపోతు ధాన్యం దోచుకుంటున్నట్టు, ఆ పల్లెవాడి ద్వారా వాళ్లకు తెలిసింది. వాళ్లిద్దరూ ఆ పల్లె చేరారు. సవరగండుపోతు శిఖిముఖిని చూసి మండిపడి, ఈటె తీసుకుని అతడి మీదికి దూకాడు. తరవాత-)

కొండప్రాంతాన శిఖిముఖి, విక్రమకేసరులకు ఎదురైన తిమ్మగూడెంవాడు, వేగంతో కుంభారమిట్ట పల్లెకు పోయాడు. అతడక్కడికి చేరేసరికి, పల్లెవాసులు కాలిపోయిన తమ గుడిసెలను బావుచేసుకుంటున్నారు. వాళ్లల్లో ప్రతి ఒక్కడి ముఖంలోనూ కోపం, దైన్యం కనపడుతున్నది. తిమ్మ గూడెం వాడు, కొత్తగా కట్టబడుతున్న ఒక గుడిసె ముందాగి, ''శబర మాతకూ జై! నేను తిమ్మగూడెం శబరుణ్ణి. పల్లె పెద్ద శివాలుడి ఇల్లెక్కడ? సవర గండుపోతు మా గూడెం మీద పడి ధాన్యం దోచుకుపోతున్నాడు, మీ పల్లె నుంచి సహాయం కావాలి,'' అన్నాడు.

అతడి మాటలు వింటూనే గుడిశె పని చేస్తున్న ఒక మధ్యవయసువాడు, చేతిలో ఉన్న తాళ్లనూ, కర్రలనూ కింద పడేసి, ''చావుకబురు చల్లగా చెబుతున్నావా, ఏం? తొందరగా పద, రాత్రి ఆ సవర గండుపోతు ముఠావాళ్లే మా గుడిశెలు తగలబెట్టారు. వాళ్ల కోసం పల్లె పెద్దకొడుకు శిఖిముఖి అరణ్యమంతా గాలిస్తున్నాడు. గండుపోతు మీ పల్లెల్లో ఉన్న సంగతి పల్లెపెద్ద శివాలుడికి వెంటనే తెలియపరచటం మంచిది,'' అంటూ, గబగబా శివాలుడి ఇంటి కేసి దారితీశాడు. అతడి వెనకగా తిమ్మగూడెం వాడు బయలుదేరాడు.

దాసరి సుబ్రహ్మణ్యం

ఆ ఇద్దరూ శివాలుడి ఇంటిని సమీపించేసరికి, ఇంటిముందున్న పెద్ద మామిడి చెట్టుకింద శివాలుడు కొందరు పల్లెపెద్దలతో మాట్లాడుతున్నాడు. తిమ్మగూడెం వాడు అతడికి దణ్ణం పెట్టి, నాలుగైదు మాటల్లో తను వచ్చినపని చెప్పి, తమ గూడెం కేసి శిఖిముఖీ, మరొక యువకుడూ వెళ్లినట్టు చెప్పాడు.

అంతా విన్న శివాలుడు చప్పున లేచి నిలబడి, ''శిఖీ, విక్రమకేసరీ తిమ్మగూడేనికి వెళ్లారన్నమాట. ఇది దుస్సాహసం. ఆ సవరగండుపోతును నే నెరుగుదును, వాడసలే దుష్టుడు. ఇప్పుడు పరమ దుష్టుడైన శిథిలాలయ పూజారితో వాడు నేస్తం కట్టాడు. సరే, వాళ్లిద్దర్నీ మనం సర్వనాశనం చేసి తీరాలి. పల్లెయువకుల్లో ఓ పాతికమంది మెరికల్లాంటి వాళ్లను పిలవండి.'' అన్నాడు.

ఆ వెంటనే పల్లె పెద్దల్లో ఒకడు పక్కనున్న గుడిశెలోకి పరుగెత్తిపోయి, ఒక డప్పు తీసుకుని బయటికి వచ్చి దాన్ని బలంగా మోగించసాగాడు. ఒకటి రెండు నిమిషాలు గడవకముందే, పల్లెలోని యువకులు చాలా మంది ఈటెలు పట్టుకుని అక్కడికి పరిగెత్తుకొచ్చారు. శివాలుడు వాళ్లలో ఓ పాతిక మందిని వేరు చేసి పక్కగా నిలబెట్టి, ''ఇదిగో, ఈ తిమ్మగూడెం అతడితో మీరు వెంటనే బయలుదేరిపోండి. దారిలో సవరగండు పోతు ముఠావాళ్లు ఎదురైనా సరే, వాళ్లతో అట్టే జగడం పెట్టుకోక, మీరు సూటిగా తిమ్మగూడేనికే పోవాలి. నేను వెనకగా బయలుదేరివస్తాను,'' అన్నాడు.




తిమ్మగూడెంవాడు ముందుండి దారి తీయగా శబరయువకులు అతడి వెంట అరణ్యం కేసి పరుగెత్తారు. తరవాత శివాలుడు ఇంట్లోకి పోయి ఉడుపులూ, అడవి పక్షుల ఈకలతో ఉన్న శిరస్త్రాణం ధరించి బయిటికి వచ్చాడు.

ఆసరికి ఇంటిముందు చాలామంది పల్లెవాసులు చేరారు. శివాలుడు వాళ్లతో, ''నేను తిరిగి వచ్చేవరకూ మీరంతా తగు జాగ్రత్తలో ఉండండి, సవరగండుపోతుకు కావలిసింది తిండిధాన్యం. శిథిలాలయ పూజారికి అవసరం అయినది నా ఇంట్లో ఉన్న తాళపత్ర గ్రంథం. నేను లేని సమయంలో వాడు నా ఇంటి మీదికి దాడి రావచ్చును, జాగ్రత్త!'' అని హెచ్చరించాడు.

''వాడు అద్భుతశక్తులున్నవాడు. మూడో కన్ను తెరిచి సర్వం భస్మం చేయగలడు,'' అన్నాడొకడు జనంలోంచి. ఆ మాట్లాడిన వాడు ఎవడో తెలుసుకునేందుకు శివాలుడు



తలతిప్పి పరీక్షగా చూసి, వాడు కనబడక పోయేసరికి, పెద్దగా గొంతెత్తి, ''మన పల్లె వాసుల్లో కనీసం ఒకళ్లిద్దరికైనా ఆ పూజారి అద్భుతశక్తుల్లో నమ్మకం కలగడం ఆశ్చర్యంగా ఉంది. పూజారీ, వాడి డబ్బు తిన్న అధములూ లేపే పుకార్లు నమ్మకండి.'' అన్నాడు.

తరవాత అతడు కొందరు పల్లెవాసుల్ని వెంటబెట్టుకుని తిమ్మగూడెం కేసి బయలు దేరాడు. అరణ్యంలో కొంత నడిచి కొండ ప్రాంతాన్ని చేరగానే, అక్కడ వారికి విరిగి నేలమీద పడి ఉన్న రాక్షసిబొమ్మ కనిపించింది. శివాలుడి వెంట ఉన్న వాళ్లందరూ దాన్ని చూసి చాలా భయపడ్డారు.

శబరుల్లో ఒకడు కిందపడి ఉన్న త్రిశూలాన్ని చేతికి తీసుకుని, దానికి అంటి ఉన్న రక్తాన్ని పరీక్షగా చూసి, శివాలుడి దగ్గిరకు వచ్చి, ''ఈ త్రిశూలం నూటికి నూరు పాళ్లు కంచుది. మన ప్రాంతాల ఎవరూ ఈ లోహాన్ని ఇందుకు వాడరు. దీన్ని అంటి ఉన్న నెత్తురు మనిషిది కాదు, ఏదో అడవి జంతువుది,'' అన్నాడు.

శివాలుడు త్రిశూలాన్ని అందుకుని అటూ ఇటూ తిప్పి చూసి, ''నువ్వన్నది నిజం, వయసులో ఉండగా విక్రమకేసరి దొర వెంట హిమాలయ పర్వత ప్రాంతాలకు వెళ్లినప్పుడు, ఈ కంచులోహాన్ని అక్కడివాళ్లు రకరకాల వస్తువులు చేయడానికి ఉపయోగించడం నేను చూశాను ''అని ఓ క్షణకాలం ఏదో ఆలోచిస్తూ ఊరుకుని తరవాత ''సరే పదండి, కాలయాపన ఎందుకు,'' అంటూ ముందుకు నడిచాడు. 'ఈ త్రిశూలం శిథిలాలయ పూజారిదే నంటావా, శివాలు దొరా! వాడు హిమాలయ ప్రాంతాల నుంచి వచ్చినవాడే కదా?'' అని ప్రశ్నించాడు, త్రిశూలాన్ని శివాలుడికిచ్చిన శబరుడు.

''వాడిమాటలెలా నమ్మటం? వెయ్యేళ్లుగా శిథిలాలయ పూజారిత్వం, మూడో కన్ను, కావాలనప్పుడు అదృశ్యమైపోవటం.. ఇందులో ఏదో మోసం ఉంది. వాణ్ణి చేజిక్కించుకుంటేనే గాని నిజం బయటపడదు. ముందు మనం త్వరగా తిమ్మగూడెం చేరాలి. మనకంటే ముందు పోయిన వాళ్లు, ఈ సరికి గూడెం చేరి ఉంటారనుకుంటాను.'' అన్నాడు శివాలుడు.

శివాలుడి ఊహ సరైనదే. తమ పల్లె పెద్దకొడుకు ప్రమాదంలో చిక్కుకుని ఉండొచ్చని భావించిన శబరయువకులు, తిమ్మగూడెం వాడి వెంట అగమేఘాల మీద ఆ గూడేనికి పరుగెత్తారు. గూడెం పరిసరాలను చేరుతూనే, సహాయం కోసం వచ్చిన

ఆ గూడెం వాడు శబర యువకులను సరా సరి గండుపోతు ఉన్న చోటుకు తీసుకు పోకుండా, పక్కదారుల వెంట వాళ్లను నడిపి, గండుపోతు ధాన్యం దోచుకుం టున్న ప్రదేశానికి చేర్చాడు.

వాళ్లు అక్కడికి చేరేంతలో గండుపోతు రంకెలు వేస్తూ, శిఖిముఖి మీదికి దూకాడు. శిఖిముఖి యీటె పైకెత్తి ముందుకడుగు వేయబోయేంతలో, గండుపోతు దృష్టి అప్పుడే అక్కడికొచ్చిన శబరయువకుల మీద పడింది. వాళ్లంతా శిఖిముఖి వెనకవైపు నుంచి ఆయుధాలెత్తి ముందుకు ఉరక బోతున్నారు. గండుపోతు వాళ్లను చూస్తూనే తక్కువ ఆగిపోయి పెద్దగొంతుతో, ''మోసం! కపటం! పోటాపోటీకి రమ్మని పిలిచి నీ వాళ్లను నా మీదికి దొంగదాడికి ఉసికొల్పు తున్నావా?'' అంటూ చూపుడు వేలును శబర యువకుల కేసి ఎత్తాడు.

శిఖిముఖీ, అతడికి అంత దూరంలో నిలబడి ఉన్న విక్రమకేసరీ ఆశ్చర్యంగా వెనక్కి తిరిగి చూశారు. వాళ్లకు కొండల దగ్గిర తమకు కనిపించిన తిమ్మగూడెం వాడి వెంట వచ్చిన శబరయువకులు ఈటెలు పట్టుకుని ముందుకు వస్తూండటం కని పించింది. శిఖిముఖి వెంటనే చేయెత్తి వాళ్లకు ముందుకు రావద్దని సౌంజ్ఞ చేసి, ''మీరంతా ఉన్నచోటునే ఆగండి. ఈ సవర గండుపోతూ, నేనూ మా బలాబలాలు తేల్చుకోబోతున్నాం.'' అన్నాడు.

శబర యువకులు ఆ మాట వింటూనే ఎక్కడివాళ్లక్కడ నిలబడిపోయారు. శిఖి



ముఖి, గండుపోతు కేసి తిరిగి, ''ఊ, దెబ్బకాచుకో, గండుపోతూ!'' అని అరిచి ముందుకు అడుగు వేయబోయాడు. కాని అంతలో గండుపోతు ఒకడుగు వెనక్కు వేసి, ''నువ్వు నీ వాళ్లనందర్నీ వీపు వెనక వత్తాసు పెట్టుకుని, నా మీదికి దెబ్బలాడ వస్తున్నావు. ఒకవేళ.. ఒకవేళ ఏమిటి? నువ్వు నా చేతిలో తప్పక చచ్చి తీరుతావు– కాని, ఆ సమయంలో నీ శబరమంద అంతా ఒంట రిగా ఉన్న నా మీదికి వచ్చి పడతారు,'' అన్నాడు.

''ఎవరిచేతిలో ఎవరు చచ్చేదీ ఇప్పుడే తేలిపోతుంది. గప్పాలు కొట్టకు. కావా లంటే నీ వాళ్లను కూడా నువ్వు నీ వెనక రక్షణకోసం తెచ్చుకో,'' అన్నాడు శిఖిముఖి.

ఆ వెంటనే గండుపోతు చప్పట్లు చరిచి కేకలు పెట్టాడు. గూడెంలో ఎక్కడెక్కడ ఉన్న అతడి అనుచరులంతా తమ నాయ కుడి దగ్గరకు పరిగెత్తుతూ వచ్చారు. గండు

పోతు వాళ్లందర్నీ వడ్లపాతరకు అవతలి మైపున ఆయుధాలతో సర్వసన్నద్ధంగా ఉండ మనీ, శిఖిముఖి ముఠా వాళ్లు ఉన్న చోటు నుంచి కాలు కదిపితే చాలు, వాళ్ల మీదికి ఉరకమనీ ఆజ్ఞలు ఇచ్చాడు.

ఆ తరవాత శిఖిముఖీ, గండుపోతూ ఈటెలతో కలియబడ్డారు. గండుపోతు ఈటె విసుర్లను శిఖిముఖి తన ఈటెని అడ్డంగా పెట్టి ఆపుతూ, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ, ధాన్యం పాతర చుట్టూ గిరిగీలు తిరగసాగాడు. అతడి ఎత్తుగడ ఏమిటంటే, గండుపోతును ఆఖరు దెబ్బతీసేముందు అతణ్ణి బాగా అలిసిపోయేట్టు చేయాలని.

గండుపోతుకు, శిఖిముఖి తనను పాతర చుట్టూ తిప్పడం చిర్రెత్తిస్తున్నది. ఈ కుర్ర కుంకను క్షణాలమీద ఈటెతో నాలుగు పోట్లు పొడిచి పాతర్లో పడవేసి ఇంత మట్టి కప్పించగలనని అతడనుకున్నాడు, కాని ఆ కుంక చిడతగండులా తన ఈటె దెబ్బకు అందకుండా తప్పుకుంటూ, తనతో దాగుడు మూతలాట లాటిదేదో ఆడుతున్నాడు....

''ఒరే పిరికికుట్టే! అంత భయపడి పారి పోదలిచిన వాడివి నాతో ఎందుకు పంతా నికి దిగావు?'' అంటూ పళ్ళు కొరికి, ఆయాసపడసాగాడు గండుపోతు.

''పోతూ! నేను పారిపోవటం లేదు. నీ ప్రాణం తీయబోతున్నాను!'' అంటూ శిఖి ముఖి ఒక్క కేకపెట్టి, తన ఈటెను రెండు గుప్పెళ్లలోనూ గట్టిగా బిగించి పట్టుకుని, గండుపోతు చేతిలోని ఈటెను బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు గండుపోతు పట్టు కున్న ఈటె పట్టుదప్పి ఎగిరి అంతదూరాన పడిపోయింది. అతడు దానికోసం పక్కకు తిరిగి పరిగెత్తబోయేంతలో శిఖిముఖి అతడి భుజంమీద తన ఈటె అలుగును బలంగా ఆనించి, ''పోతూ! శరణను, ఓడిపోయా నను, నిన్ను ప్రాణాలతో వదులుతాను,'' అన్నాడు.



''గండుపోతు శబరకుక్కను శరణన డమా?'' అంటూ గండుపోతు భీకరంగా అరిచి ఎడం చేత్తో, భుజం మీద ఆనించి ఉన్న శిఖిముఖి ఈటెను పక్కకు కొట్టి, కుడిచేత్తో మొలనున్న పొట్టి కత్తిని చర్రున లాగి మీదికి దూకాడు. శిఖిముఖి చప్పున ఒకడుగు వెనక్కు వేసి, అతడి కత్తి దెబ్బను తప్పుకుని, తిరిగి గండుపోతు మీదికి రాబోయేంతలో ఈటెతో అతడి కుడిచేతిని బలంగా ఒకపోటు పొడిచి, అతడి ఎడమ మోకాలి మీద గట్టిగా ఒక తన్ను తన్నాడు.

గండుపోతు బాధతో ఒక అరుపు అరి చాడు. అతడి చేతిలోని కత్తి జారి కింద పడింది. మోకాలిమీద తగిలిన తాపుకు కాలిపట్టు తప్పి అతడు పక్కనున్న వడ్లపాత రలో దభీమంటూ పడిపోయాడు.

ఇది చూస్తూనే అతడి అనుచరుల్లో హాహాకారాలు బయలుదేరినై. వాళ్లలో కొందరు పారిపోయేందుకు వెనుదిరిగ బోయేంతలో, ఒక సవరుడు ఎడమచేత్తో ఈటె పైకెత్తి, కుడిచేత్తో జబ్బచరుస్తూ, ''గండుపోతు దొర తరవాత నేనూ ఇక్కడ నాయకుణ్ణి! ఈ శిఖిముఖినీ, వాడి కులం వాళ్లనూ కన్నుమూసి తెరిచేంతలో నరికి పోగులు పెడతాను. మీరు నా వెన్ను కాచి ఉండండి. చాలు రండి.'' అంటూ శిఖి ముఖి కేసి బయలు దేరాడు.

శిఖిముఖికి ప్రమాదం రానున్నదని గ్రహించిన విక్రమకేసరి, శబరయువకు లందర్నీ హెచ్చరించి శత్రువులను ఎదు ర్కొనేందుకు బయలుదేరాడు. అటు సవరలు కొత్త నాయకుడి వెంట ముందుకు సాగారు. భయంకరమైన పోరూ, రక్తపాతం తప్పని పరిస్థితి ఏర్పడిన ఆ దశలో సవరల వెనక నుంచి శివాలుడు ఎలుగెత్తి కేక పెట్టాడు. ''అనవసర రక్తపాతం ఎందుకు? గండుపోతు ముఠావాళ్లంతా లొంగిపోండి! ఆయుధాలు కింద పడవేయండి.''

ఆ కేక వింటూనే గండుపోతు అనుచ రులు వెనక్కు తిరిగి చూశారు. శివాలుడూ మరి కొందరు శబరులూ ఈటెలు ఎత్తి తమ కేసి రావడం వాళ్ల కంటబడింది. ముందు వైపునుంచి విక్రమకేసరి శబరయువకులతో మీదికి వస్తున్నాడు. ఇప్పుడేం చేయటం? లొంగిపోవటమా? లేక నిలబడి ఎదిరించ టమా? (ఇంకా ఉంది)





# మనిషికి శాపం!



పట్నం వెళ్ళిన తన కొడుకు ప్రతాపుడు చీకటి పడిన తర్వాతగాని రాడనుకున్న అతడి తల్లి జయమ్మ సూర్యాస్తమయం కాకుండానే తను తిరిగి రావడం చూసి, ''ఈ రోజు అరటిగెల త్వరగా అమ్ముడు పోయినట్లుంది!'' అన్నది.

ప్రతాపుడు కష్టజీవి. ఇంటి వెనక మురుగు నీరు పారేచోట అరటి మొక్కలు నాటాడు. ముదిరిన అరటి గెలలు పట్నం తీసుకువెళ్ళి సంతలో అమ్మితే, ఎంత లేదన్నా గెలకు వంద రూపాయిలొస్తాయి.

ప్రతాపుడి భార్య విమల, భర్తకోసం మంచి నీళ్ళు తీసుకు వచ్చి, ''పిల్లల బడి జీతాలు రేపే కట్టాలట!'' అన్నది.

''అలాగా! ఎన్నో నెలలుగా కష్టపడి పెంచిన అరటిగెల అమ్ముడు పోయినా, ఆ డబ్బు అనుభవించే ప్రాప్తంలేని బతుకు. అంతా నా ఖర్మ!'' అని విసుక్కుంటూ, అరటిగెల అమ్మగా వచ్చిన డబ్బు విమల చేతిలో పెట్టాడు ప్రతాపుడు.

''అంతలా చిరాకు పడితే ఎలారా?'' అన్నది జయమ్మ.

''లేకపోతే నాన్న చేసిన పనికి ఆనంద పడాలా?'' అన్నాడు ప్రతాపుడు కోపంగా.

ఆ మాటలకు జయమ్మ తెల్లబోతూ, ''పదేళ్ళ క్రితం పోయిన మీ నాన్నను, ఇప్పుడు ఆడిపోసుకుంటున్నావు దేనికి?'' అని అడిగింది.

ప్రతాపుడు కొద్దిసేపు మౌనంగా వూరుకుని, ''అమ్మా, జరిగిందేమిటో నీకు తెలియంది కాదు. నాన్న స్నేహితుడు నరసింహం పదిహేనేళ్ళ క్రితం, ఇక్కడిపొలాలు అమ్మేసుకుని పట్నంలో వ్యాపారం పెట్టి, నాన్నను కూడా రమ్మన్నాడు. నాన్నకు పుట్టిపెరిగిన ఊరువదలడం ఇష్టంలేదు. ఇప్పుడు మనకు మిగిలింది నాలుగెకరాలు. దాని మీద వచ్చే ఆదాయంతో ఐదుగురం బతకాలి. నాన్న కూడా వ్యాపారంలో దిగితే ఎంత బావుండేది!'' అన్నాడు. దానికి జయమ్మ నిట్టూర్చి, ''బావుంది!

మాచిరాజు కామేశ్వరరావు



ఆ పైవాడు ఎవరికి ఎంత రాస్తాడో, అంతే దక్కుతుంది,'' అన్నది.

''అలా వేదాంతం చెప్పకు. ఆ నరసింహం కొడుకు గోవిందం నా ఈడువాడే. ఎంత సుఖంగావున్నాడు! పట్నానికీ, మన ఊరుకూ మధ్యవున్న అడవిలోని ఋషీశ్వరుడిని దర్శించడానికి గుర్రపు బగ్గీలో వెళుతూ, నడిచొస్తున్న నన్ను బగ్గీలో ఎక్కించుకున్నాడు. వాడి భోగాన్ని చూస్తుంటే నా గుండె రగిలిపోతోంది,'' అన్నాడు ప్రతాపుడు కోపంగా.

కొడుకు కోపం చూసి జయమ్మ మరి మాట్లాడ లేదు. ఆ రాత్రి విమల, ''మీరు కూడా వెళ్ళి ఆ ఋషీశ్వరుడిని చూడకూడదా? ఆయన కనికరిస్తే, మన జీవితాల్లో ఏమైనా మార్పురావచ్చు,'' అన్నది భర్తతో.

భార్య సలహా నచ్చిన ప్రతాపుడు ఆ మర్నాటి ఉదయానే ఋషీశ్వరుడి ఆశ్రమానికి వెళ్ళాడు. ఋషీశ్వరుడు, ప్రతాపుడిని చూస్తూనే, ''ఏం నాయనా, అలా విచారంగావున్నావు?'' అని అడిగాడు నవ్వుతూ.

ప్రతాపుడు తన పరిస్థితి చెప్పుకుని, ''మీ భక్తుడు గోవిందం ఒకప్పుడు మా ఊరివాడే. ఆయన తండ్రి అతడికి లక్షల ఆస్తిపాస్తులు ఇచ్చాడు. మా నాన్న నాకు ఇచ్చింది ఏపాటి! నాకు నా జీవితం మీద రోతపుడుతున్నది,'' అన్నాడు ఆవేశంగా.

ఋషీశ్వరుడు చిన్నగా నవ్వి, ''జీవితంలో హెచ్చుతగ్గులు సహజం. కాల ప్రవాహంలో మార్పులు అనివార్యం. అయినా, మీ నాన్నగారు ఇచ్చిన తరగని ఐశ్వర్యాన్ని నువ్వు గుర్తించలేక పోతున్నావు. అదే నీ ఆరోగ్యం! నువ్వు కష్టపడతావు; కడుపునిండా తింటావు. ఇంట్లో అందరూ నిన్ను అభిమానిస్తారు. దానికి మించిన భాగ్యం లేదు. అయినా, నీలో ఈ అసంతృప్తి, నీ మిత్రుణ్ణి చూశాకేగదా కలిగింది? అంతకు ముందు సుఖంగానే వున్నావు. నిజానికి అతణ్ణి గురించి తెలుసుకుంటే, నీలో ఈ అసంతృప్తి ఉండేది కాదు,'' అన్నాడు.

''గోవిందం భోగభాగ్యాలతో హాయిగా వున్నాడు. అతడికేం కొరత?'' అని అడిగాడు ప్రతాపుడు.

''అయితే విను! గోవిందంలో ఐశ్వర్యం తెచ్చే అన్ని వ్యాధులూ, ఈ వయసుకే తిష్ఠ వేశాయి. కోట్లువుండి ఏం లాభం! తీపి తినాలంటే చక్కెర వ్యాధి, ఉప్పు తినాలంటే రక్తపు పోటు. నాలుగడుగులు వేయనీయకుండా ఆయాసం. వీటికితోడు

వ్యాపారంలో తట్టుకోలేని పోటీ నిద్ర లేకుండా చేస్తోంది. మందుల కోసం, మనశ్శాంతి కోసం తరచూ ఇక్కడికి వస్తూంటాడు,'' అన్నాడు ఋషీశ్వరుడు.

''అలాగా!'' అంటూ ఆశ్చర్యపోయాడు ప్రతాపుడు.

ఋషీశ్వరుడు ఒక క్షణం ఆగి, ''కావాలంటే నిన్ను క్షణాలలో కోటీశ్వరుణ్ణి చేయగలను. ప్రశాంతమైన ఇప్పటి జీవితమే కావాలో, మనశ్శాంతి లేని కోటీశ్వరుడి జీవితం కావాలో, నువ్వే నిర్ణయించుకో,'' అంటూ ప్రతాపుడి తల మీద చేయిపెట్టాడు. ఆ వెంటనే ప్రతాపుడి కళ్ళు మూతలుపడినై.

ప్రతాపుడు బ్రహ్మాండమైన భవనంలో హంసతూలికాతల్పం మీద పడుకుని వున్నాడు. ఇంటినిండా సేవకులు. ఎదుట పళ్ళూ, పంచభక్ష్య పరమాన్నాలూ. కానీ, ప్రతాపుడు ఆయాసంతో ఎటూ కదలలేక పోయాడు. సేవకులను గట్టిగా పిలవడం కూడా సాధ్యపడలేదు. అతి ప్రయత్నం మీదలేచి కూర్చుని, నేల మీద కాలుమోపి ముందుకు అడుగు వేయబోయిన వాడలాగే పడిపోయాడు. అలా పడిపోయినవాడు భార్యనూ, తల్లినీ పిలిస్తే వాళ్ళు, సేవకులను పిలవసాగారు.

ఆ వెంటనే ప్రతాపుడు, ''వద్దు! వద్దు! నాకీ జీవితంవద్దు!'' అని అరుస్తూ కళ్ళు తెరిచాడు. ఎదురుగా ఋషీశ్వరుడు మందహాసం చేస్తూ, అతడికి కనిపించాడు. ''నాకళ్ళు తెరిపించారు, స్వామీ! కోటీశ్వరుడి బాధలు నాకు వద్దు. నన్ను కంటికి రెప్పలా చూసుకునే భార్య, ముత్యాల్లాంటి ఇద్దరు పిల్లలు, నా మీదే ప్రాణాలు పెట్టుకుని బతికే తల్లి. నాకేంలోటు?'' అన్నాడు ప్రతాపుడు.

''చాలా సంతోషం, నాయనా! తృప్తి, ఆరోగ్యం, ఆనందం–ఇవి మనిషికి ఎంతో ముఖ్యం. అవి ఉంటే డబ్బుతో పనిలేదు. మరొక సంగతి; మనిషికి అసూయ శాపం వంటిది. నీ మిత్రుడిని చూశాకే అది నీలో తలెత్తింది. అసంతృప్తికి లోనయ్యావు. ఇప్పుడది తొలగి పోయింది. ఇక నీ ఇంట్లో ఆనందం వెల్లివిరుస్తుంది, వెళ్ళిరా!'' అని ఆశీర్వదించాడు ఋషీశ్వరుడు.

ప్రతాపుడు ఋషీశ్వరుడి పాదాలకు నమస్కరించి, సంతోషంగా ఇంటికి తిరుగు ప్రయాణమయ్యాడు.



# బాల స్వరాజ్

## చత్తీస్ఘర్ నుండి బాల విలేకరులు

ప్రియ పాఠకులారా,

ముందే వాగ్దానం చేసినట్లుగా, బాల విలేకరుల నుంచి మరిన్ని కథలను మీకు అంది స్తున్నాము. ఈ సంచికలో ''బాల స్వరాజ్'' చత్తీస్ఘర్ నుంచి వచ్చింది. పిల్లలు తమ రోజువారీ విద్యా కార్యక్రమాల్లో పాల్గొంటూనే క్రమం తప్పకుండా ఫీల్డ్‌కి వెళుతూ తమను నేరుగా ప్రభావితం చేస్తున్న అంశాలపై ఎలా నివేదిస్తున్నారనే కథనాలను మీకు అందించడానికి ఇక్కడి మాయారామ్ సుర్జన్ ఫౌండేషన్, యునిసెఫ్‌తో భాగస్వామ్యంలోకి వచ్చింది.

మా రాబోయే సంచికలలో, యునిసెఫ్ ప్రచురించిన బాలల హక్కుల ఒడంబడిక నుంచి కొన్ని పుటలను జతపర్చబోతున్నాము. దీంతో మీరు మీ హక్కులను తెలుసుకుంటారు. ఎందుకంటే ఇవి మీకు సంబంధించిన హక్కులు. చక్కటి ఆరోగ్యం, నేర్చుకొవడానికి అవకాశాలను పొందడం, అందరి అభిమానాన్ని, గౌరవాన్ని పొందడం వంటి పలు అంశా లలో మీరు ఎదగడానికి ఈ హక్కులు మీకు బాసటగా నిలుస్తాయి.

ప్రియమైన బాల పాఠకులారా,

ఈ సంచికను మీరు చూసే సమయానికి, మీరు మీ తదుపరి తరగతులలో చదువుతుం టారు.ఈ కొత్త సెషన్‌లో మీకు కొత్త స్నేహితులు పరిచయం అవుతారు. అయితే పలు కారణాల వల్ల బడి వదిలిపెట్టి వెళ్లిన మీ పాత స్నేహితులు కూడా మీ పరిసరాలలో ఉండవచ్చు. పాఠశాల వదిలి వెళ్లిన తర్వాత వారు ఏం చేస్తున్నారో తెలుసుకోవడానికి మీ పాత స్నేహితుల సంక్షేమం గురించి మీరు విచారించాల్సి ఉంది. తప్పనిసరై బడి మానివేసిన మీ స్నేహితుల నిస్సహాయ పరిస్థితిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించండి. వాళ్లు బడి మానివేసినందుకు గల కారణా లను కనుగొనడానికి ప్రయత్నించండి.

ప్రతి బాలుడికి, బాలికకు విద్యా హక్కు ఉంది. మీ ఉజ్వల భవిష్యత్తుకు విద్య తప్పని సరి. బడికి రాని పిల్లలతో, వారి తల్లిదండ్రులతో మీరు మాట్లాడి, పిల్లలు బడి మానకూడ దని, చదువు కొనసాగించాలనే విషయాన్ని వారికి అర్థం చేయించాలి. వారు తమ చదువు కొనసాగించడంలో మిత్రులు సాయం చేయగలరేమో ఆలోచించండి. మీరు నచ్చ చెప్పిన తర్వాత కూడా ఏ కారణం వల్లనయినా పిల్లలు బడికి రాలేనట్లయితే సరిసమానమైన పరీక్షను ఇంటివద్ద కూర్చునే వారు రాయవచ్చు, తదుపరి చదువులను కూడా వారు కొనసాగించవచ్చు.

పాఠశాలలకు హాజరు కాలేకపోయిన మీ మిత్రుల గురించి సమాచారాన్ని సేకరించడా నికి ప్రయత్నించండి.

మీ దీదీ,

బాల విలేకరుల బృందం, చత్తీస్ఘర్

## పాలిథిన్ బ్యాగులు సేకరిస్తున్న మీరా

మా గ్రామం బాసున్‌కు ఒక చివరన కొన్ని గుడిసెలు ఉన్నాయి. ఒక గుడిసెలో మీరా నివసిస్తోంది. ఆమె తన తల్లిదండ్రులతో కలిసి ఉంటోంది. ప్రతి రోజు ఉదయం ఏడు గంటలకు ఆమె తండ్రి ఇనుము, తగరపు రేకుల చిత్తు సామానులను కొనుక్కురావడానికి బయటకు వెళతాడు. తన సైకిల్ మీద ఊరు విడిచి ఊరు తిరుగుతూ చిత్తు సామాను కొనడం, అమ్మడం చేస్తుంటాడు. ఆమె తల్లి బుట్టనిండా పాములను పెట్టుకుని ఊరి వారికి చూపించి వాటిని ఆడిస్తూ ప్రతిఫలంగా వారినుంచి కాసిన్ని డబ్బులు తీసుకుని వస్తూంటుంది. మీరా ఒంటరిగా ఇంట్లో ఉంటుంది. ఆమె కూడా అప్పుడప్పుడూ సంచీ వెంట బెట్టుకుని డబ్బుల కోసం పాలిథిన్ కవర్లను సేకరిస్తూ ఉంటుంది. ఆమె బడికి వెళ్లదు. ఆమెకు ఏడేళ్లు. ఇంటికి తిరిగి వచ్చాక, ఆమె ఇంటిపనులన్నీ చేసేది. పేదరికం కారణంగా మీరా పాఠశాలకు వెళ్లలేదు. ఇతర ప్రపంచానికి భిన్నంగా వారు తిండిసంపాదన కోసమే రోజువారీ జీవితం గడుపుతున్నారు.

– కాజల్ పాండే,
విలేజ్ బేసిన్,
వి.కె.హెచ్. ఫింగేశ్వర్




*Source: UNICEF CRC booklet*

## చదువుకోసం తపిస్తున్న మధు

మా ఇంటికి దగ్గరలో ఉన్న గోరీ గ్రామంలో మధు చౌహాన్ అనే బాలిక ఉంటోంది. వయసు పదేళ్లు. సంవత్సరం క్రితం మధు నాన్న పోయారు. మధు నాలుగో తరగతి దాకా చదువుకుంది. కుటుంబసభ్యులు తనను చదివించకూడదని అనుకుంటు న్నట్లు మధు తెలిపింది. ఆమె మామయ్య టీచర్. ఆమెకు ఇద్దరు సోదరులు ముగ్గురు చెల్లెళ్లు ఉన్నారు. ఆమె తన సోదరులు, చెల్లెళ్లందరి బాగోగులు చూసుకోవడమే కాకుండా, ఇంటిపని కూడా మొత్తంగా చేస్తుంది. నాతో మాట్లాడుతున్నప్పుడు మధు భోరున ఏడ్చింది. నాన్న చనిపోయిన తర్వాత అత్త, మామ తనను నానా అగచాట్లు పెడుతున్నారని చెప్పింది. తనను హింసిస్తున్నారని కూడా మధు చెప్పింది. తర్వాత నేను మధు వాళ్లమామయ్యతో మాట్లాడాను. తమ ఇళ్లలో ఆడపిల్లలను చదివించమని అతడు తేల్చి చెప్పాడు. ఎందుకంటే ఇంటి బయటి పనులకు వారు వెళ్లవలసిన పని లేదట. అందుచేత వారు నాలుగ్గోడల మధ్య ఇంటి పని చూసుకుంటే చాలట. కాని, మధు మాత్రం జీవితంలో చదువుకుని పైకి రావాలని కోరుకుంటోంది.

– విక్కీ జైస్వాల్,
చోప్రా గ్రామం, వి.కె.హెచ్. మల్హరిదా




*Source: UNICEF CRC booklet*

## ఇల్లు గడవడానికి ఐస్ అమ్ముతున్న మనోజ్

తక్త్పూర్ మండల కేంద్రానికి 20 కిలోమీటర్ల దూరంలో ఉన్న రాజ్‌పూర్ గ్రామంలో ఐస్ అమ్ముతున్న ఒకబ్బాయిని చూసి అతడి వివరాలు అడిగాను. తన పేరు మనోజ్ కుమార్. వయస్సు పదమూడేళ్లు. ఎనిమిదో తరగతి చదువుతున్నాడు. పుండి గ్రామ పాఠశాలలో అతడు చదువుతున్నాడు. తండ్రి పేరు భుజ్వాల్, తల్లి పేరు లడాన్. ఎంతవరకు చదువుకోవాలనుకుంటున్నావని అతడిని అడిగాను. దీనికి అతడు సమాధానమిస్తూ సెలవులలో కుటుంబానికి అండగా ఉండాలని ఐస్ అమ్మి డబ్బులు సంపాదిస్తున్నట్లు అతడు చెప్పాడు. చదువుకోవాలని ఉన్నా, ఇంట్లో పరిస్థితుల వల్ల కుదరటం లేదని మనోజ్ బాధపడ్డాడు.

– వివేక్ కార్ష్, రాజ్‌పూర్ గ్రామం, వి.కె.హెచ్ తక్తపూర్

## తమ్ముడిని చదివించాలనుకుంటున్న సంజయ్

సంజయ్ నేథమ్ పెండ్రా గ్రామంలో ఉంటున్నాడు. వయస్సు 11 ఏళ్లు. తండ్రి లేనందువల్ల బడి మానేయవలసి వచ్చింది. ఐదవ తరగతి చదువుతున్నప్పుడు అతడు బడిమానేశాడు. అతడికి తల్లి, తమ్ముడు ఉన్నారు.తల్లి పేరు శ్రీమతి పార్వతీ మేథమ్, తమ్ముడిపేరు రాజు మేథమ్. ఇతడికి ఏడేళ్లు. అతడు రెండవ తరగతి చదువుతున్నాడు. రాజు చదువు కోసం సంజయ్, అతడి తల్లి కూలీ పని చేస్తున్నారు. అనారోగ్యం కారణంగా సంజయ్‌ని ఆస్పత్రిలో చేర్పించారు. కడుపు నొప్పి, వాంతులు అతడి అస్వస్థతకు కారణం. వారి ఆర్థిక పరిస్థితి బాగాలేనందున తగిన ఆహారం తీసుకోవడం లేదు. దీంతో రోగాలు తగ్గే అవకాశం కూడా లేదు. కూలి పని చేసి సంపాదించిన కాసిన్ని డబ్బులతోటే వారు ఇల్లు నడుపుతున్నారు. సంజయ్‌కి కూడా చదువుకోవాలని ఉంది కాని దారిద్ర్యం కారణంగా తను చదువు నిలిపివేసి తన తమ్ముడిని చదివించాలని అనుకుంటున్నాడు. అందుకే అతడు చిన్న వయసులోనే తప్పనిసరై కూలిపని చేస్తున్నాడు.

– పార్వతీ యాదవ్, మన్‌పూర్ గ్రామం, వి.కె.హెచ్. మన్‌పూర్

చందమామ పాఠకులారా మీ అభిప్రాయాలు వినడానికి మేం ఇక్కడ ఆసక్తిగా ఎదురుచూస్తున్నాము. బాల స్వరాజ్ రూపొందించిన అంశాలపై మీ వ్యాఖ్యలు/కథనాలు మాకు పంపండి. మా చిరునామా:
Mayaram Surjan Foundation, Deshbandhu, Ramsagar Para, Raipur, Pin- 492001. **Email:info@msfraipur.org**



With support of UNICEF



# జావా జానపద కథ

## కోడిపుంజు సాయం!

ఈనాటి ఇండొనేషియాలో అంతర్భాగమైన జావాలో శతాబ్దాలక్రితం పలు రాజ్యాలు ఉండేవి. అలాంటి ఒక రాజ్యానికి కేతనం కోడిపుంజు. దానికిసంబంధించినపూర్వగాథ ఇది:

రాజుగారి ఏకైక సంతానమైన యువ రాజుకు కోడిపందాలంటే మహా ఇష్టం. ఎప్పుడు చూసినా స్నేహితులతో కలిసి కోడి పందాలాడుతూ వినోదించేవాడు. దాంతో ఆయన స్నేహితులు బలమైన కోడిపుంజులు ఎక్కడ కనిపించినా సరే, అవి ఎవరివైనా సరే, వాటిని పట్టుకుని కోడిపందాలు నిర్వహించేవారు.

ఎవరెవరో వచ్చి, తాము యువరాజు మిత్రులమని చెప్పి తమ కోడిపుంజులను పట్టుకుపోవడం రాజ్య ప్రజలకు బాధ కలిగించింది. అయినా, ఆ విషయాన్ని రాజుగారి దృష్టికి తీసుకు వెళ్ళే ధైర్యం ఎవరికీ లేదు. అయితే, రాజు ఒకసారి రాజ్యంలో మారువేషంలో తిరుగుతుండగా, కొందరు యువకులు రైతులనుంచి బల వంతంగా బలిష్ఠమైన కోడిపుంజులను లాక్కుపోవడం, ఇదంతా మన యువరాజు కోసమే చేస్తున్నట్టు చెప్పడం గమనించాడు. ఆ తరవాత ప్రజలు ఇది తరచూ జరుగుతూన్న వ్యవహారమే అని మారువేషంలో వున్న రాజు అడగడంతో తమ గోడును వెళ్ళబోసుకున్నారు.

విచారంతో రాజభవనానికి తిరిగి వచ్చిన రాజు, యువరాజును వెంటనే రాజ్యాన్ని వదిలి వెళ్ళమని ఆగ్రహావేశంతో ఆజ్ఞాపించాడు. యువరాజుకు రాజభవనాన్ని వదిలిపెట్టక తప్పలేదు. యువరాజు రాజ్యపొలిమేరల్లో వున్న అరణ్యం చేరే వరకు గూఢచారులు ఆయన్ను వెంబడించి వెళ్ళి, తిరిగివచ్చారు.

అప్పటికే బాగా పొద్దుపోయింది. అరణ్యాన్ని మెల్ల మెల్లగా చీకటి ఆవరిస్తోంది. యువరాజు దారీ తెన్నూ తెలియక కొట్టుమిట్టాడ సాగాడు. ధైర్యశాలి అయినప్పటికీ క్రూర మృగాల అరుపులు అతన్ని భయాందోళనకు గురిచేశాయి. అంతలో దూరంలో వున్న ఒక గుడిసెలో నుంచి మిణుకు మిణుకుమంటూ దీపం వెలుతురు కనిపించడంతో, అక్కడికి వెళ్ళి తలుపుతట్టాడు. తలుపు తెరిచిన ఒక యువతి నఖ శిఖ పర్యంతం అతన్ని ఒకింత అనుమానంగా చూసింది. అతడు



తాను యువరాజునన్న విషయం దాచి, రాజుగారి ఆగ్రహానికి గురై రాజ్యబహిష్కారం శిక్ష పొంది, అడవులు పట్టిన దురదృష్టవంతుణ్ణని మాత్రం చెప్పాడు. ఆ యువతి అతని మీద దయ తలచి తలదాచుకోవడానికి చోటిచ్చింది.

ఆతిథ్యం పొందిన అతను, ''ఈ గుడిసెలో మీరు ఒక్కరే ఉంటున్నారా?'' అని అడిగాడు చుట్టుపక్కల ఎవరూ లేకపోవడంతో.

అందుకు ఆమె, ''తన తల్లిదండ్రులు అడవిలో లభించే మూలికలను సేకరించి, వైద్యులకు అమ్మి, దాంతో వచ్చే ఆదాయంతో పొట్టపోసుకునేవాళ్ళం. వారు అలా ఒకనాడు మూలికలతో, దాపులనున్న నదిని దాటుతూ ఉండగా, వెల్లువ వచ్చి వాళ్ళు ఎక్కిన పడవ తల్లకిందులు కావడంతో చనిపోయారు. ఆ తరవాత ఎక్కడికెళ్ళాలో తెలియక, తన తల్లిదండ్రులు చేసిన పనినే కొనసాగిస్తూ ఇక్కడే ఒంటరిగా ఉంటున్నాను'' అన్నది.

ఆమె వివరాలు తెలుసుకున్న యువరాజు ఆమెతో పాటే ఉండిపోవాలని నిశ్చయించుకుని, ఆమె సమ్మతితో తనను పెళ్ళాడాడు.

కొన్ని నెలలు గడిచాయి. తన తండ్రి మరణించిన వార్త, కట్టెలు కొట్టేవారి ద్వారా యువరాజుకు చేరింది. ''నేను ఇప్పుడే నగరం వెళ్ళి కొన్ని రోజుల తరవాత వస్తాను. వచ్చాక నీకో శుభవార్త చెబుతాను. మనకు మంచి రోజులు రానున్నాయి,'' అన్నాడు భార్యతో.

''త్వరగా వచ్చెయ్. వచ్చాక నేనూ నీకో సంతోషకరమైన విషయం, చెబుతాను,''



అన్నది భార్య, తాను తల్లి కాబోతూన్న విషయం బయట పెట్టకుండా.

తిరిగి వచ్చిన యువరాజును చూడగానే నగర ప్రజలు ఆనందోత్సాహాలు పొందారు. రాజ్యానికి ఏకైక వారసుడు ఆయన. యువరాజుకు రాజ్య బహిష్కార శిక్ష విధించాడే తప్ప, రాజు తనకు వారసుడిగా వేరెవరినీ ప్రకటించలేదు. యువరాజుకు వెనువెంటనే రాజ్య పట్టాభిషేకం జరిగింది. సంప్రదాయ బద్ధమైన ఇతర క్రతువులు జరగడానికి మరికొన్ని రోజులు పట్టింది. వాటి మధ్య అడవికి వెళ్ళి భార్యను చూసే అవకాశం యువరాజుకు కలగలేదు.

అదే సమయంలో అడవిలో అకాల వర్షాలు, వెల్లువ బీభత్సం సృష్టించాయి. యువరాజు భార్య ఒక గుహలో తలదాచుకోవలసివచ్చింది. అడవి సమీపంలో నివసించే కట్టెలుకొట్టేవారి భార్యలు ప్రసవ సమయంలో దగ్గరుండి ఆమెను ఆదుకున్నారు. ఆమె చక్కని మగబిడ్డను కన్నది.

పట్టాభిషేకానంతరం యువరాజు, తన భార్యను రాజధానికి వెంటబెట్టుకు రావడానికి అడవికి వెళ్ళాడు. అయితే, అక్కడ ఆమెగాని, ఆమె గుడిసె ఆనవాళ్ళుగాని కనిపించలేదు. నిరాశతో వెనుదిరిగాడు.

ఒకనాడు యువరాజు భార్య బిడ్డతో, గుహ ముందు కూర్చుని ఉండగా, ఆకాశంలో ఎగురుతూన్న ఒక గద్ద ముక్కు నుంచి ఒక కోడిపిల్ల జారి ఆమె ఎదుట పడింది. ఆమె దానిని తీసి కాపాడింది. తన బిడ్డతో పాటు ఆహారం పెడుతూ పెంచసాగింది. కోడిపిల్ల, ఎవరూ ఎప్పుడూ ఎక్కడా కనీవినీ ఎరగనంతగా బలిష్ఠమైన కోడి పుంజుగా ఎదిగింది. దాన్ని చూసిన ఇతర పక్షులూ, జంతువులూ ఆ గుహ దరిదాపులకు రావడానికి కూడా జడుసుకునేవి.

అక్కడ నగరంలో కొత్త రాజు మళ్ళీ కోడి పందాలను ప్రారంభించాడు. అయితే,



ఇప్పుడు కోడిపుంజులను రైతుల నుంచి బలవంతంగా అపహరించడంలేదు. పందాలలో గెలిచిన పుంజులకు బహుమతులు ఇస్తామని ప్రకటించాడు.

ఆ ప్రకటన గురించి కట్టెలు కొట్టే వారి ద్వారా అడవిలో పెరుగుతూన్న యువరాజు కుమారుడు కళేరసు చెవిన పడింది. అతనికిప్పుడు వయసు పన్నెండేళ్ళు. తల్లి అనుమతితో కళేరసు తన కోడిపుంజును తీసుకుని రాజధానికి బయలుదేరాడు. అతడు అక్కడికి చేరేసరికే కోడిపందాలు ముమ్మరంగా సాగుతున్నాయి. ఆ రోజు రాజుగారే స్వయంగా శిక్షణ ఇచ్చిన కోడి పుంజు ఇతర పుంజులను ఢీకొని సులభంగా ఓడించింది.

''మహారాజా! నా పుంజు, మీ పుంజును గనక ఓడిస్తే మీరు నాకెలాంటి బహుమతి ఇస్తారు?'' అని అడిగాడు కళేరసు, బుట్టలో దాచిన తన కోడిపుంజును చూపకుండా.

రాజు మొదట ఆ కుర్రవాణ్ణి చూడగానే ఏదో తెలియని ఆకర్షణకులోనయ్యాడు. ''అయితే, మా కోడిపుంజు నీ పుంజును ఓడిస్తే?'' అని అడిగాడు రాజు.

''నేను నా పుంజు ద్వారా బహుమతి సంపాయిద్దామన్న ఆశతో వచ్చిన పేద కుర్రాణ్ణి. మీకేం ఇవ్వగలను? కొన్నాళ్ళు మీకు సేవలందించగలను,'' అన్నాడు కళేరసు. ఆ తరవాత బుట్టలోనుంచి కోడి పుంజును వెలుపలికి తీశాడు.

''ఓరి దేవుడా! ఎంత పెద్ద కోడిపుంజు!'' అంటూ ఆశ్చర్యపోయారు అక్కడి వారందరూ.

వెనువెంటనే పందాలు ఆరంభమయ్యాయి. అంతకు క్రితం, మిగతా పుంజు



లన్నిటినీ ఓడించిన రాజుగారి కోడిపుంజు, కళేరసు కోడిపుంజు వద్ద చిత్తుగా ఓడింది. రాజు కళేరసుకు వంద బంగారు నాణాలు బహుమతిగా ఇచ్చాడు. ఆ తరవాత రాజుగారి వద్ద వున్న మిగిలిన కోడిపుంజులన్నింటినీ కళేరసు పుంజు సునాయాసంగా ఓడించడంతో, రాజు అతనికి మరిన్ని బంగారు నాణేలు, ధనం, మెడ హారాలు బహూకరించాడు.

''అబ్బాయీ, నీ పుంజును అమ్మడానికి నీకేమైనా అభ్యంతరమా?'' అని అడిగాడు రాజు.

''క్షమించండి మహారాజా! ఈ పుంజు నా ప్రాణ నేస్తం. ఇది నేను పుట్టినప్పుడు చిన్న పిల్లగా ఆకాశం నుంచి వచ్చింది. ఇద్దరం కలిసి పెరిగి ఇంత వాళ్ళయ్యాం. ఇప్పుడు ఈ పుంజు సంపాయించిన బహుమతి మొత్తంతో, నేనూ మా తల్లీ సుఖంగా జీవించగలం,'' అన్నాడు కళేరసు.

''నువ్వు ఎప్పుడు పుట్టావు?'' అని అడిగాడు రాజు.

''పన్నెండేళ్ళ క్రితం. అప్పుడు మహాప్రవాహం అడవిని ముంచెత్తిందట! అప్పటికే మా తండ్రి, ఎందుకో హఠాత్తుగా వెళ్ళిపోవడంతో మా తల్లి దూరంలో వున్న ఒక గుహలోకి పారిపోయి ప్రాణాలతో తప్పించుకుందట...'' అంటూ మహారాజుకు వివరించాడు కళేరసు.

''సరే, పుంజును అమ్మడానికి నీకు ఇష్టంలేదనుకో, నువ్వు ఇక్కడే రాజభవనంలో నాతో ఉండడానికి నీకేమైనా అభ్యంతరమా?'' అని అడిగాడు రాజు.

''అది మా తల్లి అభిప్రాయం మీద ఆధారపడి వుంది మహారాజా!'' అన్నాడు కళేరసు.

రాజు సింహాసనంపైనుంచి చటుక్కున లేచి, ''నువ్వు నన్ను నీ తల్లి దగ్గరికి తీసుకు వెళ్ళు,'' అన్నాడు గద్గద స్వరంతో.

''అలాగే మహారాజా!'' అని కళేరసు అక్కడి నుంచి బయలుదేరాడు. రాజూ, రాజపరివారం అతడి వెంట బయలుదేరారు.

అడవి ప్రాంతంలో నివసిస్తూన్న పేద ప్రజలు ఆ దృశ్యం చూసి విస్తుపోయారు. రాజుగారి ముందు, గుర్రం మీద కూర్చుని వస్తూన్న తన బిడ్డను చూసిన కళేరసు తల్లి ఆనందాశ్చర్యాలకు హద్దులు లేకుండా పోయింది. మరికొద్ది క్షణాల్లో రాజు ఎవరన్నదీ ఆమె గుర్తించి ఆనంద బాష్పాలు రాల్చింది. అప్పటి కప్పుడే మహారాజు కళేరసును యువరాజుగానూ, అతడి తల్లిని పట్టమహిషిగానూ ప్రకటించాడు. ఊరేగింపు రాజధానికేసి బయలుదేరింది.

తండ్రి తదనంతరం కళేరసు రాజ్యసింహాసనాన్ని అధిష్ఠించాక, కోడిపుంజును తన రాజ్యకేతనంగా ప్రకటించాడు! -(ఎం.డి)



# ముని-వేటగాడు



ఒకానొక అరణ్యసమీపంలోని గ్రామంలో, ఒకవేటగాడుండేవాడు. అతడు, అరణ్యంలోని జంతువులను నిర్దయగా వేటాడి జీవించేవాడు. పక్షికంటిచూపును మించిన గురితో అతడు వేటకు వెళితే అడవి జంతువులూ, పక్షులూ వణికిపోయి తమ ఉనికి కానరాకుండా సద్దుమణిగేవి. వేట దొరక్కపోతే జంతువుల, పక్షుల పిల్లలను సైతం అతగాడు వదిలేవాడు కాదు. దాంతో ఆ చుట్టుపక్కల గ్రామాల వాళ్లందరూ వాణ్ణి నిర్దయుడు అని పిలిచేవారు.

ఒక రోజున వేటలో వాడికి ఏ ఒక్క జంతువూ దొరకలేదు. వాడు అరణ్యమంతా గాలించి, ఎలాగో ఒక లేడి పిల్లను వేటాడగలిగాడు. దాన్ని భుజానేసుకుని ఇంటికి తిరిగి వస్తున్నాడు.

దారిలో వాడికి ఒక ముని కనిపించి, ''ఇలారా, నాయనా!'' అని పిలిచాడు ఆప్యాయంగా.

నిర్దయుడు మునిని సమీపించి, ''ఏమిటి స్వామీ?'' అని అడిగాడు వినయంగా.

''ఆ గాయాలతో బాధపడుతున్న లేడి పిల్లను, నేలమీదపడుకోబెట్టు,'' అన్నాడు ముని.

నిర్దయుడు లేడిపిల్లను నేలమీద పడుకోబెట్టగానే ముని తన కమండలంలోని జలాన్ని దానిమీద చల్లాడు.

వెంటనే లేడి పిల్ల మానవభాషలో, ''అయ్యా, దయచేసి నన్ను వదిలిపెట్టు, లేకలేక కలిగిన నా కోసం నా తల్లిదండ్రులు ఏడ్చి ఏడ్చి ఈసరికి సొమ్మసిల్లి ఉంటారు. అయినా పుత్రవాత్సల్యం ఎలాంటిదో, నీవు ఎరగంది కాదు గదా! నీ బిడ్డ కనిపించకపోతే నువ్వు నిద్రపోగలవా? చిన్నపిల్లలను తల్లిదండ్రుల నుంచి విడదీసి ఇంత కిరాతకంగా వ్యవహరించడం నీకు న్యాయమా?'' అని నిర్దయుణ్ణి అడిగింది.

మల్లవరపు మనోహార రెడ్డి

ఆ మాటలు వినేసరికి, నిర్దయుడికి తన బిడ్డలు గుర్తుకొచ్చారు. ఇంత నిర్దయగా తాను రోజు తప్పకుండా జీవహింస చేస్తున్నది, తన బిడ్డల కొరకే, తన బిడ్డలు తనకెంతో, ఇతర్లకు కూడా తమ బిడ్డలు అంతే కదా!

ఇలా ఆలోచించి నిర్దయుడు, ఏదో ఆకు పసరుతో బాణం గాయానికి చికిత్స చేసి, దాన్ని అరణ్యంలో వదిలిపెట్టి, ఇల్లు చేరాడు. నిర్దయుడి మనసులో ఏర్పడిన దయాస్వభావం కారణంగా ఆ రోజున ఇంట్లో అందరూ పస్తుపడుకోవలసి వచ్చింది.

మర్నాడు వాడు ఒక దుప్పిని వేటాడి భుజానేసుకుని వస్తూండగా, మళ్లీ ముని కనిపించి, నిర్దయుణ్ణి దగ్గిరకు పిలిచి, కమండలంలోని జలాన్ని దుప్పిమీద చల్లాడు. వెంటనే దుప్పి మానవ భాషలో ''అయ్యా, నిండుచూలుతో కదలలేని స్థితిలో ఉన్న, నా భార్యకు ఆహారం కోసం తిరుగుతున్నాను. నన్ను వేటాడటం ధర్మమేనా? అలాంటి భార్యాపిల్లలు ఉన్న సాటి ప్రాణిగా ఆలోచించు!'' అన్నది.

తన భార్య గర్భవతిగా ఉన్నప్పుడు, తాను ఎలా పరితపించిందీ గుర్తుకు వచ్చి, నిర్దయుడు వెంటనే దుప్పిని వదిలిపెట్టేశాడు.

వేట లేకుండా తర్వాత వాడు ఇల్లు చేరేసరికి, ఆకలి బాధకు నీరసించి, కాంతి లేని కళ్లతో తన కోసం ఆశగా ఎదురుచూస్తున్న భార్యాబిడ్డలు కనిపించారు.

వాళ్లను చూసేసరికి నిర్దయుడి గుండె కరిగిపోయింది. నిండు చూలాలికి, బిడ్డలకు కాసింత తిండి పెట్టలేక పోతున్నాననే బాధపడుతూ విరక్తితో, వాడు అరణ్యంలోకి తిరిగి వచ్చి మునిని కలిసి ''స్వామీ, మీ వల్ల నాకు దయాదాక్షిణ్యాలు అలవడ్డాయి. అందుచేత వేటాడలేక, నా బిడ్డలను



పస్తులు పెడుతున్నాను. ఆ ఘోరం చూడలేక, దీనికంతకూ కారణం అయిన మీ ఎదటే ఉరిపోసుకుని చావాలని ఇక్క డికి వచ్చాను,'' అన్నాడు.

దానికి ముని మందహాసం చేసి, ''నా ఉద్దేశం నిన్ను జీవహింస మానమనేగాని, పస్తులతో చామని కాదు. ఈ ప్రపంచంలో నువ్వు బతకడానికి వేట ఒకటే మార్గమను కుంటున్నావేమో, అది పొరపాటు!'' అన్నాడు.

''మరేదైనా మార్గముంటే, మీరే సెల విప్వండి, స్వామీ!'' అని నిర్దయుడు చేతులు జోడించాడు. అప్పుడు ముని, వాడికి ఆశ్రమం దాపుల మేస్తున్న కొన్ని ఆవులను చూపి ''వాటిలో మూడు పాడి ఆవులను తోలుకుపో, వాటికి చక్కగా పోషణ చెయ్యి. అవి రోజూ ఇచ్చే పాలను అమ్మితే వచ్చే డబ్బుతో, నీ కుటుంబానికి సరిపడా ఆహారాన్ని సమకూర్చుకోవచ్చు. హాయిగా రోజులు ఎందుకు గడిచిపోవు? వేట ఒక్కటే జీవన మార్గమనే ఆలోచనను వదిలిపెట్టి కొత్త జీవనం మొదలుపెట్టు,'' అన్నాడు. ముని మాటలకు సంతృప్తి చెందిన నిర్దయుడు, మూడు పాడి ఆవు లతో గ్రామం చేరాడు.

వేటగాడు పాడి ఆవులతో అరణ్యం నుంచి తిరిగి రావడం చూసి, గ్రామస్థు లంతా ఆశ్చర్యపోయారు.

నిర్దయుడు, అడవిలో తనకు ముని సూచించిన జీవనమార్గాన్ని చెప్పి, ''ఈ నాటితో నేను జీవహింస మానేస్తున్నాను!'' అన్నాడు.

ఇందుకు గ్రామస్థులు ఎంతగానో సంతోషించారు. వాళ్లల్లో కొందరు, వాడికి పశువుల పాక కట్టుకునేందుకు అవసర మైన వెదురువాసాలు ఇచ్చారు. మరి కొందరు పశుగ్రాసం ఇచ్చారు.

ఈ విధంగా వేటగాడైన నిర్దయుడు పశుపోషకుడిగా మారిపోయాడు. వాడూ, వాడి భార్యాబిడ్డలూ పాడి ఆవుల సంర క్షణలో ఎలాంటి లోటుపాట్లూ జరగ కుండా చూసుకుంటూ, వాటి పాలను దగ్గర ఉన్న పట్టణంలో అమ్మి, వచ్చిన సంపాదనతో హాయిగా జీవించసాగారు.





# దక్కిన సొమ్ము



పరంధామయ్య అనే ఒకసన్నకారు రైతు, కూతురు వివాహఖర్చులకు గాను, తన కున్న రెండెకరాల పొలం అమ్మి, పదివేల రూపాయలు తెచ్చి ఇంట్లో దాచుకు న్నాడు. అయితే, అతడు డబ్బు దాచే సమయంలో పక్క ఊరి నుంచి వచ్చిన అతడి దూరపు బంధువొకడు అక్కడే ఉన్నాడు.

కొద్ది సేపటి తరవాత పరంధామయ్య ఏదో పనిమీద బయటకి వెళ్లాడు. ఆ సమయంలో అతడి భార్య ఇంటి వెనక పెరట్లో ఉన్నది. ఇది అవకాశంగా తీసు కుని, ఆ బంధువు డబ్బు దొంగిలించి, ఇంటికి వెళ్లిపోయాడు.

ఆ బంధువు పేరు శరభయ్య. అతడికి పెళ్లికెదిగిన కూతురున్నది. కాబోయే అల్లుడికి కట్న కానుకలు ఇచ్చే స్థోమత లేక సతమతమవుతున్నాడు. ఆ కుర్ర వాడు అదే ఊళ్లో ఉన్న సోమయ్య అనే అతని కొడుకు. ఆ సంబంధం స్థిరపరు చుకు వద్దామని, శరభయ్య అప్పటి కప్పుడే సోమయ్య ఇంటికి బయలుదే రాడు.

అలా బయలుదేరేముందు శరభయ్య, తను దొంగిలించి తెచ్చిన డబ్బును అటక మీద పాత సామానుల మధ్యగా దాచి పెట్టాడు.

అయితే, అతడి కొడుకు సుభద్రయ్య తండ్రి చిన్న సంచీతో అటక ఎక్కడం గమనించాడు. తండ్రి బయటకు పోగానే వాడు అటక ఎక్కి డబ్బు సంచీ తీసుకు న్నాడు.

వాడికి ఊళ్లో తనలాగే పనిపాటా లేకుండా అల్లరి చిల్లరిగా తిరిగే నలుగు రైదుగురు మిత్రులున్నారు. వాడు కొట్టే సిన డబ్బు సంచీని రొండిన దోపుకుని, మహదానందంతో వాళ్ల ఇళ్లకు ప్రయాణ మయ్యాడు.

బొమ్మిడి అచ్చారావు



సుభద్రయ్య పట్టరాని ఉత్సాహంతో అలా వీధిన పోతుండగా, రొండిన ఉన్న డబ్బు సంచీ జారి కింద పడిపోయింది. వాడదేం గమనించలేదు. కొంత సమయం గడిచాక, ఆ దారిన బండిలో సరుకులు వేసుకువస్తున్న, ఆ ఊరి షావుకారు బంగారు శెట్టి, దాన్ని చూశాడు.

ఆయన బండి దిగి సంచీని తీసుకుని బండిలో వేసి, తిరిగి బండి ఎక్కాడు. సంచీలో ఏదో డబ్బున్నదన్న అనుమానం ఆయనక్కలిగింది. కాని, అక్కడే దాన్ని విప్పితే, పోగొట్టుకున్న వాళ్లు వెతుకుతూ అటు వచ్చి చూస్తారేమో అన్న అనుమానం కలిగిందాయనకు.

అయితే బంగారు శెట్టి దుకాణానికి వెళుతూనే, బండిలో ఉన్న సరుకులు దుకాణంలో సర్దే హడావుడిలో ఆ సంచీ మాట కాస్త మరిచిపోయాడు. కొంత సేపటికి గుర్తుకువచ్చి, దానికోసం వెతికితే సరుకుల బస్తాల మధ్య ఆ సంచీ కనిపించలేదు.

జరిగిందేమిటంటే, సరుకులు సర్దుతున్న ఆయన పనివాడికి, ఆ సంచీ కనిపించింది. వాడు దాన్ని దుస్తుల్లో దాచుకుని పని ముగియగానే ఇంటికి వెళ్లాడు. వాడక్కడ సంచీ విప్పి చూశాడు. అందులో ఉన్న డబ్బు చూసి వాడి భార్య మూర్ఛపోయినంత పని చేసింది.

''ఇంత డబ్బు మన దగ్గిరున్నదని తెలిస్తే, మన ప్రాణాలకే ముప్పు, ఎవడో ఒకడు తెగించి దొంగిలించడానికి ప్రయత్నిస్తాడు. దీన్ని ఇపుడే గుట్టు చప్పుడు కాకుండా, పెరట్లో పాతేద్దాం. పద!'' అన్నది వాడి భార్య.

కాని, వాళ్లు అనుకున్నట్లు జరగలేదు. వాళ్లిద్దరూ పెరట్లో గొయ్యి తీసి డబ్బు పాతి పెట్టడం, పొరుగింట్లో ఉన్న శేషయ్య అనే అతను చూశాడు. అతడికి ఆ సంచీలో ఏదో విలువైన వస్తువున్నదన్న అనుమానం కలిగింది.

పనివాడూ, వాడి భార్యా ఇంట్లోకి వెళ్లి తలుపులు మూసుకోగానే, అతడు పెరటిగోడ దూకి వచ్చి, గొయ్యి మీది మట్టి లాగి, సంచీ తీసుకుని, తిరిగి గోడ మీదుగా తన పెరట్లోకి దిగాడు. కాని ఆదిలోనే అతడికి ఆటంకం ఎదురైంది.

అది మంచి నడిరాత్రి సమయం, శేషయ్య ఇంటికి కన్నం వేయడానికి వచ్చిన దొంగ ఒకడు, శేషయ్య చేసినదంతా చూశాడు. వాడికి శేషయ్య కూడా

తనలాగే దొంగ అన్న అభిప్రాయం కలిగింది.

ఈ అవకాశం వదలకూడదని, దొంగ సొమ్ములో వాటా అడగాలనుకుంటూ, వాడు శేషయ్య దగ్గరకొచ్చాడు. శేషయ్య వాడిని చూస్తూనే దొంగ అని అరవబోయి, తన చేతిలో ఉన్నది కూడా దొంగసొత్తేనని గుర్తురాగానే, దాన్ని అక్కడే జారవిడిచి వెనుకా ముందూ చూడకుండా ఇంట్లోకి పరిగెత్తాడు.

దొంగ తన అదృష్టానికి మురిసిపోతూ, శేషయ్య వదిలివెళ్ళిన సంచీ తీసుకుని వీధుల్లో పరిగెత్తసాగాడు. అయితే, ఆ రాత్రిపూట వాడి దురదృష్టం కొద్దీ కొన్ని కుక్కలు అరుస్తూ, వాడి వెంట పడ్డాయి. ఈ గడబిడతో చుట్టుపక్కల ఇళ్లవాళ్లు నిద్రలేచి పరుగెత్తుకు రాసాగారు. ఇది చూసి తను దొరికిపోతానన్న భయంతో దొంగ వణికిపోతూ డబ్బు సంచీని రహదారి పక్కకు గిరవాటు వేశాడు.

ఆ ఊళ్లోని సిద్ధాంతికి తెల్లవారు జామునే కాలవకు వెళ్లి స్నానం చేసి రావడం అలవాటు. ఆయన అలా స్నానం చేసి వస్తూండగా, దారి పక్కన పడిఉన్న డబ్బు సంచీ కళ్లబడింది.

సిద్ధాంతి దాన్ని తీసుకుని, అందులో డబ్బున్నదని పసిగట్టి ఆనందపడుతూ, తొందర తొందరగా ఇంటికి బయలుదేరాడు. ఇల్లు చేరే సమయానికి ఇంటి ముందు కొందరు గ్రామస్థులు కూర్చుని ఉండటం కనిపించింది. వాళ్లు ఆయన చేత ఏదో పెళ్లి ముహూర్తం పెట్టించుకోవడానికి వచ్చినవాళ్లు.

సిద్ధాంతి వాళ్లను చూస్తూనే, గతుక్కుమని తుండు గుడ్డచాటున డబ్బు సంచీ దాచి ఇంట్లోకి వెళ్లాడు. ఆయన దాన్ని



ఉయ్యాల బల్లమీద పెట్టి, తన కోసం వచ్చినవాళ్లతో మాట్లాడేందుకు బయటకు వచ్చాడు.

సిద్ధాంతి భార్య ఆ సమయంలోనే బట్టలుతకడానికి నీలాటి రేవుకు వెళుతూ మరి కొన్ని బట్టలతో పాటు భర్త ఉయ్యాల బల్లమీద అప్పుడే పెట్టిన తుండుగుడ్డను కూడా బిందెలో వేసుకున్నది. అయితే ఆమె తుండుగుడ్డలో చుట్టి ఉన్న డబ్బు సంచీని గమనించలేదు.

సిద్ధాంతి భార్య నీలాటి రేవు చేరిన సమయంలో అక్కడ పరంధామయ్య భార్య బట్టలుతుకుతున్నది. ఇద్దరూ కబుర్లాడుతూ పని ముగించుకుని, బట్టలను బిందెల్లో వేసుకుని ఇళ్లకు బయలు దేరారు.

అయితే, ఆ సమయంలో ఒక పొర పాటు జరిగిపోయింది. ఇద్దరి బిందెలూ, ఆ మధ్య సంతలో కొన్న రకపువి కావ డంతో, పొరపాటున ఒకరి బిందెనొకరు తీసుకోవడం జరిగింది.

పరంధామయ్య భార్య ఇంటికి వచ్చి, ఉతికి తెచ్చిన బట్టలు ఆరవేస్తుండగా, బిందె అడుగున ఆమెకు సంచీ కనిపిం చింది. ఆశ్చర్యంతో ఆమె సంచీకి ఉన్న ముడిని విప్పి చూసింది. లోపల రూపా యలు.

ఆమె వాటిని చూసి ఆశ్చర్యపోతున్నం తలో, పరంధామయ్య అక్కడికి వచ్చి, ''ఏమేవ్, నిన్న సాయంత్రం చందువా పెట్టెలో రూపాయల సంచీ దాచాను. అది కనబడటం లేదు. నువ్వు గానీ తీశావా?'' అంటూ భార్య చేతిలోని సంచీ చూసి, ''ఇది నువ్వెందుకు తీశావు. దీనికోసం గంటనుంచి వెతుకుతున్నాను,'' అని సంచీ తీసుకున్నాడు.

పరంధామయ్య భార్యకు ఆ డబ్బు సంచి తన బిందెలోకి ఎలా వచ్చిందో అర్థం కాలేదు. కాసేపు తికమక పడిన తర్వాత పొరపాటున తనే బట్టలతో పాటు దాన్ని తీసుకుపోయానేమో అనుకుని సమాధానపడింది.

ఏది ఏమైనా చివరకు పోయిన సొమ్ము పరంధామయ్యకు తిరిగి దక్కింది. ఆ కారణం వల్ల, ఆయన కూతురు పెళ్లి నిర్విఘ్నంగా జరిగిపోయింది.



# సుడోకు పజిల్

కింది రెండు సుడోకు పజిల్స్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి. ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్స్‌కు పరిష్కారాలు నవంబర్ 2010 సంచికలో ప్రచురించబడతాయి. సరైన సమాధానాలు పంపిన విజేతల్లో ఒక్కరికి రూ.500 బహుమతి ఉంటుంది.

పజిల్ – 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | |
| 1 | 9 | | | | | | 5 | |
| | | | | 9 | 7 | | 2 | |
| | 4 | | | | | 8 | | 3 |
| | 5 | | 2 | | 3 | | | |
| 8 | 6 | | | | | 5 | | |
| 3 | | | | 1 | 2 | | | |
| | 8 | | 4 | | | | 9 | 1 |
| 5 | | | | 7 | | | | |

పజిల్ – 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 8 | 5 | | 2 | | | | 3 | |
| | | | | | | 4 | | |
| | | | | | 5 | | 9 | |
| | 7 | 2 | 9 | | | 8 | | 6 |
| | | 6 | | | | 3 | | |
| 5 | | 8 | | | 6 | 9 | 7 | |
| | 1 | | 5 | | | | | |
| | | 3 | | | | | | |
| | 2 | | | | 9 | | 6 | 7 |

మీ ఎంట్రీలను 2010 సెప్టెంబర్ 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా:

**Editor, SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,**

B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.

e-mail your entries to:contests@chandamama.com

---

జూలై' 10 నెల సుడోకు పజిల్స్‌కు సరైన పరిష్కారాలు:

పజిల్ – 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 9 | 1 | 2 | 5 | 8 | 7 | 6 | 4 | 3 |
| 3 | 8 | 4 | 1 | 2 | 6 | 5 | 9 | 7 |
| 5 | 6 | 7 | 4 | 9 | 3 | 8 | 1 | 2 |
| 8 | 5 | 6 | 7 | 1 | 4 | 2 | 3 | 9 |
| 7 | 9 | 1 | 8 | 3 | 2 | 4 | 6 | 5 |
| 4 | 2 | 3 | 9 | 6 | 5 | 1 | 7 | 8 |
| 6 | 7 | 8 | 3 | 5 | 1 | 9 | 2 | 4 |
| 2 | 3 | 9 | 6 | 4 | 8 | 7 | 5 | 1 |
| 1 | 4 | 5 | 2 | 7 | 9 | 3 | 8 | 6 |

జూలై' 10 నెల సుడోకు పజిల్స్‌కు విజేతలు లేనందు వల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.

పజిల్ – 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 6 | 4 | 9 | 5 | 1 | 8 | 3 | 2 | 7 |
| 7 | 3 | 2 | 9 | 4 | 6 | 5 | 8 | 1 |
| 1 | 8 | 5 | 3 | 7 | 2 | 6 | 4 | 9 |
| 5 | 2 | 8 | 6 | 3 | 1 | 7 | 9 | 4 |
| 3 | 7 | 1 | 4 | 5 | 9 | 2 | 6 | 8 |
| 9 | 6 | 4 | 2 | 8 | 7 | 1 | 3 | 5 |
| 4 | 9 | 3 | 1 | 6 | 5 | 8 | 7 | 2 |
| 2 | 5 | 7 | 8 | 9 | 3 | 4 | 1 | 6 |
| 8 | 1 | 6 | 7 | 2 | 4 | 9 | 5 | 3 |

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 20

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. **250లు.***

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు **50** రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 20 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. సెప్టెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. నవంబర్ 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## ఆవిష్కరణలు




1. ఎక్స్-రేని ఎవరు కనిపెట్టారు?
2. 1893లో బూట్లను అతికించడానికి జిప్పర్‌ను ఎవరు కనిపెట్టారు?
3. గనులలో నీటిని తోడేందుకు 1760లో స్టీమ్ ఇంజన్‌లను ఎవరు కనిపెట్టారు?
4. ఎస్కలేటర్‌ని ఎవరు కనిపెట్టారు?
5. 1843లో మొట్టమొదటి క్రిస్టమస్‌ను ఎవరు పంపారు?
6. విమానాన్ని ఎవరు కనిపెట్టారు?
7. కంప్యూటర్‌ను కనిపెట్టిన శాస్త్రజ్ఞుడి పేరు ఏమిటి?
8. 1901లో ఉక్కు బ్లేడ్‌తో ఉన్న సేఫ్టీ రేజర్‌ను కనిపెట్టింది ఎవరు?

## చందమామ లోకజ్ఞానం క్విజ్-18 జూలై 2010 సమాధానాలు

1. వాల్మీకి రామాయణం, 2. కృపి మరియు అశ్వత్థామ, 3. రాముడు, 4. విచిత్రవీర్యుడు, 5. రోహిణి, 6. జటాయువు, 7. పది అవతారాలు, 8. యముడు

జూలై నెల క్విజ్‌కు విజేతలు లేనందువల్ల బహుమతి ప్రకటించలేక పోతున్నాము.

# కెరీర్ అంటే?



ఈ సంచికలో, మనం బాహ్య లక్ష్యాలను నిర్దేశించుకోవడం అనే ముఖ్య అంశంపై దృష్టిపెడుతున్నాము. లక్ష్యాలు రెండు రకాలు: స్వల్పకాలికం, దీర్ఘకాలికం. స్వల్పకాలిక లక్ష్యాల్లో తక్షణం చేపట్టవలసినవి, దీర్ఘకాలిక లక్ష్యాల్లో ప్రణాళికా బద్ధంగా అమలు చేయవలసి ఉంటుంది.

**నిర్దిష్టత:** లక్ష్యం ఎంత నిర్దిష్టంగా ఉంటే దాన్ని సాధించడం అంత సులువుగా ఉంటుంది. ఉదాహరణకు, మంచి మార్కులను సాధించడం అనేది నిర్దిష్ట లక్ష్యం కాదు. మంచి అంటే మీ ఉద్దేశ్యంలో అర్థం ఏమిటి? ఈ పదాన్ని నిర్వచించండి, ఎవరు (ఎవరు పాల్గొన్నారు?), ఏమి (నేను గెలవాలంటే ఏం చేయాలి?), ఎక్కడ (ఏ స్థలంలో), ఏది (అవసరాలు, నిరోధాలు), ఎందుకు (నిర్దిష్ట కారణాలు), ఎప్పుడు (కాల వ్యవధి) వంటి ప్రశ్నలను వేసుకోండి.

**విలువ కట్టదగినది:** మీ లక్ష్యాన్ని వస్తుగతంగా విలువ కట్టుకోవాలి. దీనికోసం మీ రొక ప్రమాణాన్ని నెలకొల్పుకోవాలి. ఉదాహరణకు, చరిత్రను చదవడాన్ని విలువ కట్టలేం - భారతీయ చరిత్రలో రెండు అధ్యాయాలు పూర్తి చేయడం ఒక నికర విలువగా ఉంటుంది.

**సాధించదగినది:** లక్ష్యం అనేది ఒక పరిమితిలోనే ఉండాలి. మిమ్మల్ని మీరు తక్కువ అంచనా వేసుకోవద్దు, అదే సమయంలో లక్ష్యాలు మరీ ఎక్కువగా ఉండకూడదు. ఎందుకంటే అధిక లక్ష్యం అనే తొలి అడ్డంకి వద్దే మనం చేతులెత్తివేసే ప్రమాదముంది.

**తిరిగి మదింపు చేయదగినది:** నిర్దిష్టమైన, విలువ కట్టదగిన, సాధించదగిన లక్ష్యాలు ఉంటేనే సరిపోదు. లక్ష్యాలు సాధించడానికి పథకం రచించుకుని అది నెరవేరుతున్నదీ లేనిదీ చూసేందుకు దాన్ని తిరిగి మదింపుచేయాలి. గడువులోగా లక్ష్యాన్ని సాధించగలమో లేదో తిరిగి అంచనా వేసుకోవాలి.

**కాల వ్యవధి:** భారీ స్థాయిలో ఉండే నిర్దిష్ట లక్ష్యాలను సాధించడానికి ఒక చివరి గడువును విధించుకోవాలి. ఈ చివరి గడువు నిర్దిష్టంగా ఉండాలి. సంవత్సరం, లేదా నెల అని కాకుండా చిట్టచివరి నిమిషం వరకూ ఈ చివరి గడువును నిర్దిష్టంగా విధించుకోవాలి.

ఇప్పుడు కొన్ని స్మార్ట్ గోల్స్‌ని నిర్దేశించుకోండి. మీ పథకాన్ని ముదురు రంగులతో చిత్రించి దాన్ని మీరు ప్రతి రోజూ ఉదయం చూడటానికి వీలుండే ప్రదేశంలో అంటించుకోండి. ఇది మీ లక్ష్యాలను మీకు గుర్తు చేస్తూ మిమ్మల్ని ఉత్తేజపరుస్తూ ఉంటుంది. ఛీరియో!

– సాయి





# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.

| English | I love Fridays. | The moon looks beautiful. |
|---|---|---|
| Telugu | నాకు శుక్రవారాలంటే ఇష్టం. | చంద్రుడు మనోహరంగా ఉన్నాడు. |
| Hindi | मुझे शुक्रवार पसन्द हैं।<br>ముజె షుక్రవార్ పసంద్ హైన్. | चाँद सुन्दर दिखता है।<br>చాంద్ సుందర్ దిఖ్తా హై: |
| Tamil | எனக்கு வெள்ளிக்கிழமைகள் பிடிக்கும்<br>ఎనక్కు వెళ్లికిళమైగల్ పిడిక్కుమ్ | நிலா பார்க்க அழகாக இருக்கிறது<br>నిలా పార్క అళగాగ ఇరుక్కురిదు |
| Bengali | আমি শু ক্রবারগুলোকে ভালবাসি।<br>ఆమి శుక్రబార్ గులోకే భాలోడాసి | চাঁদটাকে খুব সুন্দর দেখায়।<br>చాంద్ తాక్కే ఖుబ్ సుందర్ ధిఖాయ్ |
| Marathi | मला शुक्रवार आवडतो.<br>మాలా శుక్రవార్ ఆవడటో | चंद्र सुंदर दिसत आहे.<br>చంద్ర సుందర్ దిసత్ ఆహె. |
| Kannada | ಶುಕ್ರವಾರಗಳನ್ನು ನಾನು ತುಂಬಾ ಇಷ್ಟಪಡುತ್ತೇನೆ.<br>శుక్రవారగళన్ను నాను తుంబా ఇష్టపడుత్తేనె. | ಚಂದ್ರನು ಸುಂದರವಾಗಿ ಕಾಣಿಸುತ್ತಿದ್ದಾನೆ.<br>చంద్రను సుందరవాగి కాణిసుత్తిద్దానె. |
| Oriya | ଶୁକ୍ରବାର ମୋତେ ଭଲ ଲାଗେ।<br>షుక్రబార మోటె భాల లాగే. | ଜହ୍ନ ଭାରି ସୁନ୍ଦର ଦେଖାଯାଉଛି।<br>జాహ్నా మోటె భారి సుందర దేఖాయాచ్చి. |
| Gujarati | મને શુક્રવાર ગમે છે.<br>మనె శుక్రవార్ గమె ఛ్చె. | ચંદ્ર સુંદર દેખાય છે.<br>చంద్ర సుందర్ దేఖాయ ఛ్చె. |
| Assamese | শুকুৰবাৰবোৰ মোৰ বৰ প্ৰিয়।<br>జుక్రబార్బొర్ ముర్ బోర్ ప్రియా. | জোনটো ইমান ধুনীয়া লাগিছে।<br>జోన–టో ఎమాన్ ధునీయా లాగిసె. |
| Malayalam | എനിക്ക് വെള്ളിയാഴ്ചകൾ ഇഷ്ടമാണ്.<br>ఎనిక్కు వెల్లియాళ్‌చాకల్ ఇష్టమన్ను. | ചന്ദ്രനെ കാണാൻ നല്ല ഭംഗിയുണ്ട്.<br>చంద్రానే ఖానన్ నల్ల భంగియుందు. |
| Santali | ᱤᱧᱫᱚ ᱡᱚᱨᱩᱢ ᱢᱟᱦᱟᱸᱡᱤ ᱠᱩᱥᱤᱭᱟᱜ-ᱟ।<br>ఇంజ్‌దొ జరుమ్ మహంజి కుసియాగ్–అ | ᱪᱟᱸᱫᱚ ᱟᱰᱤ ᱪᱚᱨᱚᱠ ᱮ ᱧᱮᱞᱚᱜ ᱠᱟᱱᱟ<br>చందో ఆది చొరోక్ ఏ నెలోగ్ కానా |
| Sanskrit | शुक्रवाराणि मह्यम रोचते।<br>శుక్రవారాణి మమ రోచతె. | चन्द्रः सुन्दरम् दृश्यति।<br>చంద్రాహ్ సుందరమ్ దృశ్యతి. |
| French | jam le vondredi<br>జామ్ లె వొంద్రెడి. | la lun e bel<br>లా లున్ ఇ బెల్ |
| German | Ish leehbe Freitage<br>ఇష్ లీహ్‌బె ఫ్రెయిటెగ్. | Der Mond seeht shyon aus.<br>డెర్ మోండ్ సీత్ ష్యోన్ ఔస్. |
| Spanish | May gustaan los viernes.<br>మే గుస్టాన్ లోస్ వియర్నెస్. | La luna say ve bonitaa.<br>లా లునా సే వె బోనిటా. |





| English | Where are my books? | I went abroad for the holidays. |
|---|---|---|
| Telugu | నా పుస్తకాలు ఎక్కడున్నాయి? | సెలవుల్లో నేను విదేశాలకు వెళుతున్నాను. |
| Hindi | मेरी पुस्तकें कहाँ हैं?<br>మేరే పుస్తకేన్ కహాన్ హైన్? | मैं छुट्टियों में बाहर गया था।<br>మైన్ చుట్టియోన్ మైన్ బాహర్ గయా థా. |
| Tamil | என்னுடைய புத்தகங்கள் எங்கே?<br>ఎన్నుడైయ పుత్తగంగల్ ఎంగే? | நான் விடுமுறைக்கு வெளிநாடு சென்றிருந்தேன்<br>నాన్ విడుముఱైక్కు వెలినాడు సెంద్రురుందేన్. |
| Bengali | আমার বইগুলো কোথায়?<br>ఆమార్ బోయిగులో కొత్తాయే? | আমি ছুটিতে বাইরে গেছিলাম।<br>ఆమి చుట్టి దే బాయిరే గెచ్చిలుమ్ |
| Marathi | माझे पुस्तकं कोठे आहे?<br>మజె పుస్తకం కొథె ఆహె? | मी सुट्ट्यांमधे विदेशात गेलो होतो/गेले होते.<br>మీ సుట్యాన్మధే విదేశత్ గెలో హోతో/ గెలే హోతే. |
| Kannada | ನನ್ನ ಪುಸ್ತಕಗಳು ಎಲ್ಲಿವೆ?<br>నన్న పుస్తకగళు ఎల్లివే? | ರಜಾದಿನಗಳನ್ನು ಕಳೆಯಲು ನಾನು ವಿದೇಶಕ್ಕೆ ಹೋಗಿದ್ದೆ.<br>రజాదినగళన్ను కలెయలు నన్ను విదేశక్కె హోగిద్దే. |
| Oriya | ମୋର ବହିଗୁଡ଼ିକ କେଉଁଠାରେ ଅଛି?<br>మోర బాహిగుడిక క్యుంతారె అచ్చి? | ମୁଁ ଛୁଟିରେ ବିଦେଶ ଯାଇଛି।<br>మున్ ఛుటిరె బిదేష యాచ్చి. |
| Gujarati | મારી ચોપડીઓ ક્યાં છે?<br>మరే చోపడియో క్యాన్ ఛె. | હું રજાઓમાં વિદેશ ગયો હતો/ગઈ હતી.<br>హున్ రాజోమా విదేష గయో హటో/గయి హటి. |
| Assamese | মোৰ কিতাপবোৰ ক'ত?<br>మోర్ కిటాప్బుర్ కోటె? | বন্ধত মই বিদেশলৈ গৈছিলো।<br>బోంధోత్ మోయి బిడెక్స్లోలోయ్ గోయిసిలు. |
| Malayalam | എന്റെ പുസ്തകങ്ങൾ എവിടെ?<br>ఎంటే పుస్తకంగల్ ఎవిడె? | അവധിക്കാലത്ത് ഞാൻ വിദേശത്ത് പോയി.<br>అవధిక్కాలత్తు న్యాన్ విదేశత్తు పోయి. |
| Santali | ᱤᱧᱟᱜ ᱯᱚᱛᱚᱵ ᱚᱠᱟᱨᱮ?<br>ఇంజగ్ ఫోటోబ్ ఒకరె? | ᱡᱤᱨᱟᱜ ᱢᱟᱦᱟᱨᱮ ᱵᱟᱦᱨᱮᱧ ᱥᱮᱱᱚᱜ ᱠᱟᱱᱟ।<br>జిరాగ్ మహరె బహ్రెంజ్ సెనోగ్ కాన. |
| Sanskrit | मम पुस्तकानि कुत्र सन्ति?<br>మమ పుస్తకాని కుత్ర సంతి? | अहम् अवकाशाय विदेशे अगच्छन्।<br>అహమ్ అవకాశాయ్ విదేష్ అగచ్ఛాన్. |
| French | ou son me livre<br>ఒయు సోన్ మి లివ్రె. | je swi ale a letronje<br>జె స్వి అలె అ లెట్రోంజె. |
| German | Wo sind meyene Buesher?<br>ఓ సింద్ మెయెనె బ్యూషర్? | Ish reyeste fuer die Urlaube ins Ausland.<br>ఇష్ రేస్టే ఫ్యూర్ డై ఉర్లాబె ఇన్స్ అస్లాండ్. |
| Spanish | Donde estaan mees leebros?<br>దొండె ఎస్టాన్ మీస్ లేబ్రోస్? | Fue aal extrankhero para vakaciones.<br>ఫ్యూ ఆల్ ఎక్స్ట్రాంఖెరో పారా వకసియోనెస్. |



# నవ్వుల పువ్వులు




టీచర్: సునందా, వీటికి సమాధానాలను నీవు మోనిక నుంచి కాపీ చేశావు, నిజమేనా?
సునంద: మీరెలా చెప్పగలరు టీచర్?
టీచర్: ఎందుకంటే 10వ ప్రశ్నకు ఆమె 'నాకు తెలియదు' అని రాసింది. నువ్వు కూడా 'నాకు తెలియదు' అనే రాశావు.




ఒక వ్యక్తి గోడ పక్కన వేగంగా నడుస్తున్నాడు. అక్కడ ఓ స్వరం ఇలా వినిపించింది. 13..13.. అతడు గోడకు ఓ రంధ్రం ఉండటం గమనించి దాని గుండా చూశాడు. ఉన్నట్లుండి అతడి కంట్లో పుల్ల గుచ్చుకుంది. ఆ స్వరం మళ్లీ ఇలా మొదలెట్టింది. 14... 14...




టీచర్: నీవు భౌగోళిక శాస్త్రాన్ని సరిగ్గా చదవలేదని అర్థమవుతోంది. ఇందుకు నీ సంజాయిషీ ఏమిటి?
విద్యార్థి: ''ప్రపంచం ప్రతిరోజూ మారుతూ ఉంటుందని మా నాన్న చెప్పాడు. అది స్థిరంగా అయ్యేంతవరకు వేచి ఉండాలని నిర్ణయించుకున్నానండి!''




దత్తు: అమ్మా! లెక్కల హోమ్‌వర్క్‌కోసం కొన్ని లెక్కలు చేసిపెట్టవా?
అమ్మ: లేదు, అది సరైనది కాదు. నీ పని నువ్వే చేసుకోవాలి.
దత్తు: కనీసం ప్రయత్నించవచ్చు గదమ్మా!

ఒకరి ఇంట్లో కొత్తగా టెలిఫోన్ అమర్చారు. అతడు వెంటనే టెలిఫోన్ కార్యాలయానికి ఫోన్ చేసి, ''నా టెలిఫోన్ వైరు చాలా పొడవుగా ఉంది. మీవైపుకు కాస్త లాక్కుంటారా?''







ప్రయాణీకుడు: రైలు టైమ్ టేబుల్ తీసుకుంటే ఏమిటి ప్రయోజనం? రైళ్లు ఎన్నటికీ సకాలంలో రావు.
స్టేషన్ మాస్టర్: అందులోనే ఉంది రహస్యమంతా. టైమ్ టేబుల్ అనేది లేకపోతే రైళ్లు ఆలస్యంగా వస్తున్నాయని మనకెలా తెలుస్తుంది?

శీను: ఎందుకంత దిగులుగా ఉన్నావు?
లత: నేను చేయని పనికి టీచర్ నన్నే తిట్టింది!
శీను: ఏమిటి?
లత: నా హోమ్‌వర్క్...






విజయ్: నాన్నా, మీ కళ్లు మూసుకుని మీ పేరు రాయగలరా?
నాన్న: రాయగలనని అనుకుంటాను విజయ్.
విజయ్: సరే. అయితే కళ్లు కాస్త మూసుకుని నా ప్రోగ్రెస్ రిపోర్టు కార్డులో కాస్త సంతకం చేయండి.

# కుడ్యచిత్రాలలో మహాభారతం!



మహారాష్ట్రలోని అజంతా, ఎల్లోరా గుహాలయాలు, అక్కడి కుడ్యచిత్రాలు జగత్ప్రసిద్ధాలు. ఇక దక్షిణాదికి వస్తే, తమిళనాడులోని సిత్తన్నవాసల్, తంజావూరు, తిరునందిక్కావల్ ఈ మూడు ప్రాంతాలలో ఇలాంటి కుడ్యచిత్రాలు కనిపిస్తాయి.

తంజావూరులోని బృహదీశ్వరాలయంలోని కుడ్యచిత్రాలు తప్ప, మిగిలిన రెండు ప్రాంతాలలోని కుడ్యచిత్రాలు కాపాడుకోలేనంతగా చెరిగిపోయాయి. తంజావూరు దేవాలయం రెండవ అంతస్తులోని గోడలు ఈ చిత్రాలతో అలంకరింపబడి ఉన్నాయి. అయితే, భద్రత దృష్ట్యా దాన్ని కొన్నాళ్ళుగా మూసివేశారు. భారతదేశంలోనే అతిపెద్ద దేవాలయంగా పరిగణించబడుతున్న బృహదీశ్వరాలయాన్ని యునెస్కో ప్రపంచ వారసత్వ ప్రదేశంగా గుర్తించింది. ఇది 11వ శతాబ్దిలో చోళులు నిర్మించిన శైవాలయం.

తంజావూరులోని 'దక్షిణ మండల సాంస్కృతిక కేంద్రం' కుడ్యచిత్రాల పట్ల ప్రజల ఆసక్తిని పెంపొందించడానికి కొన్ని చర్యలు చేపట్టింది. 250 చ. అడుగుల విస్తీర్ణంగల గోడల మీద మహాభారత కథను చిత్రాలుగా చిత్రించాలని నిర్ణయించింది. ఈ కథను వివరించే 21 ఫలకాలు ఉంటాయి. వేదవ్యాసుడు విఘ్నేశ్వరుడికి కథ చెబుతూంటే, విఘ్నేశ్వరుడు లిఖించేట్టు మొదటి చిత్రం ఉంటుంది. ప్రదక్షిణ మార్గం లోపలి గోడమీద కుడ్యస్తంభాలపై నటరాజుని పూజిస్తున్న రాజు చిత్రం, పక్షుల చిత్రాలు, పద్దెనిమిది రోజుల మహాభారత యుద్ధానంతరం దుర్యోధనుడి ఊరుభంగాన్ని చిత్రించేది చివరిచిత్రం.

కేరళకు చెందిన ఒక చిత్రకారుల కుటుంబం ఈ చిత్రాలను చిత్రించడం మరో విశేషం. ఈ చిత్రాలు చిత్రించడానికి ఉపయోగించే రంగులను రకరకాల ఆకులు, పువ్వులు, పళ్ళు, కొన్ని రకాల చెట్ల బెరడులు, రాళ్ళ పొడులు మొదలైన వాటి మిశ్రమంతో తయారు చేస్తారు. తండ్రి గోడలకు 'బేస్ కలర్' వేస్తాడు; కొడుకు రేఖాచిత్రాలను అంటే లైన్ డ్రాయింగ్స్ గీస్తాడు. తల్లి వాటిని రంగులతో నింపుతుంది.

20

# ఆర్య
## మాణిక్య ద్వీప అన్వేషణ

చిత్రాలు: గాంధీ అయ్య

మరిఘా చనిపోయిందని థార్విక్ నమ్మేలా ధర్మపిత, ఆర్య ఇద్దరూ జిత్తులు పన్నినట్లుగా సలూంకీ గుర్తించాడు. రాణి సుకన్యను పట్టుకోవడమొక్కటే ఇపుడు మిగిలిన ఏకైక మార్గమని అతడు థార్విక్‌కు చెబుతాడు.

వెళితే నీ జీవితం ప్రమాదంలో పడుతుంది.

ఎలా?

నీవు ప్రభాత్ అని ఆర్యకు తెలుసు. నిన్ను అతడు నిర్బంధిస్తాడు.

నన్నొక విషయం బాగా బాధిస్తోంది....

నేను పూర్వకు వెళ్లి ఆర్య మంత్రిగా అయినప్పుడు నా నిజమైన పేరు థార్విక్ అనే విషయం మర్చిపోయాను.

నీవు నాకు దూరంగా ఉండేవాడివి. నీపై నా ప్రభావం ఏదీ లేదు.









తొలిసారి ఆర్యను కలిసి ద్వంద్వయుద్ధానికి సవాలు చేసినప్పుడు మరోఘా మా ఇద్దరి మధ్యలోకి వచ్చి అతడిని కాపాడింది. సువర్ణద్వీప మాణిక్యాన్ని కనుగొనడంలో నాకు సహాయం చేస్తానని ఆమె నాకు హామీ ఇచ్చింది.










నేను తెలుసుకోవలసింది నాకు చెప్పండి.
మరీషా ఇప్పుడు మహిళ. కాబట్టి ఆమె మళ్లీ తోడేలుగా మారలేదు.
ఇప్పుడామె ఎక్కడుంది?
శాంతిపురిలో ఉంది.
ఆమె అక్కడికి ఎందుకు వెళ్లింది?
నీ గురించి రాణిని హెచ్చరించేందుకు.
అవును! రాణితో ఆమె స్నేహం చేసేలా మనం సాయం చేయాలి.
ఆమె ఎలాంటి మిత్రురాలిగా రుజువు చేసుకోవాలి! గొర్రె రూపంలోని తోడేలు కదా!


ఆమె ఇప్పుడేమి చేస్తోంది?


ఆమె రాజ్యం వెలుపల మర్రిచెట్టు కింద నిద్రపోతోంది..


రేపు, ఆమె రాజమందిరానికి వెళుతుంది.


అయితే మనం ఇప్పుడే దాడి చేయాలి.


అలాగే జరుగుతుంది! నేను ఇప్పుడు ఆమె మనస్సులోకి ప్రవేశించాలి.
(ఇంకా ఉంది)

# ఎగిరే చేప

ఈ సంచికలో, మీరు అతి సులభంగా చేయగలిగిన, అద్భుతమైన ఎగిరే వస్తువును మీకోసం ఇస్తున్నాము. నేలమీదకు వచ్చే క్రమంలో గిరికీలు కొట్టి గుండ్రంగా తిరుగుతుంది.





## కావలసినవి:

- కాగితపు ముక్క, కత్తెర



## ఎలా చేయాలి?

- 2 సెంటీమీటర్లవెడల్పు, 12 సెంటీమీటర్ల పొడవు ఉన్న పాత వార్తాపత్రిక ముక్కను తీసుకోండి. కాగితం ముక్కను పొడవుగా ఉంచండి. కుడి చేతి వైపు కింది భాగంలో చివరినుంచి 1.5 సెంటీమీటర్ల వరకు ముక్కను సరి సగానికి, అడ్డంగా కత్తిరించండి.
- అదేవిధంగా ఎడమ చేతి పై భాగంలో కూడా కత్తిరించండి.
- కత్తిరించిన భాగాలను ఒకదానిలో ఒకటి దూరేలా అమర్చండి. దీంతో అవి పరస్పరం అతుక్కుంటాయి. కాగితం చేప ఇప్పుడు సిద్ధంగా ఉంది.




- కాగితం చేపను గాల్లో పైకి విసరండి. అది నేలమీద పడేలోగా గిరిగీలు కొడుతూ, గుండ్రంగా తిరుగుతుంది. వివిధ పరిమాణాలు, రంగులలో ఉండే ఎగిరే చేపలను తయారు చేయడానికి ప్రయత్నించండి. ఎగిరే చేపను ఇంతకంటే సులువుగా, అబ్బురమనిపించే స్థాయిలో మీరు మరోలా చేయలేరు.

**కాన్సెప్ట్:** ఈ బొమ్మ ప్రకృతి అద్భుతాలను ఎన్నిటినో చూపిస్తుంది. రెక్కలున్న గింజలు లేదా యూకలిప్టస్ ఆకులు పైనుంచి కింద పడుతున్నప్పుడు గిరగిరా తిరుగుతూండటం మీరు చూసే ఉంటారు. వాటి రెక్కల కోణమే వాటిని గుండ్రంగా తిరిగేలా చేస్తుంది.

రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూనివర్సిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)

# సింగిల్ స్ట్రోక్



చేప వానపామును తినాలనుకుంటోంది!
వానపాము తప్పించుకోవడంలో నీవు
సాయపడతావా?














## బొమ్మకు రంగులు వేయండి











హలో! సున్న ఏనుగవుతుందా?
ఒక పెద్ద సున్నను ఏనుగు రూపం
వచ్చేలా గీయగలరా?
ప్రయత్నించండి మరి..!



# ఫల నిధి

ఒక నిర్దిష్ట థీమ్‌లో మీరు ఆల్బమ్ రూపొందించడానికి, కింద ఇచ్చిన చిత్రాలను ఉపయోగించవచ్చు. ఈ నెల అంశం 'పండ్లు'


















CHANDAMAMA (Telugu) September 2010 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11



# బుబ్బా జట్టు సాహసాలు




ఇంటర్-కాలేజ్ క్విజ్ పోటీ. ఎ, బి టీమ్‌లలో ఒక్కోదానిలో ముగ్గురు యువ సభ్యులు. రోహన్, అమిత్, రేష్మి ఎ టీమ్ సభ్యులు. అమిత్ నిద్రపోతున్నాడు.



చివరి ప్రశ్న - "మూడో అంపైర్ చేత రన్ అవుట్‌గా ప్రకటించబడిన తొలి బ్యాట్స్‌మన్ ఎవరు?"

జాంటీ రోడ్స్ అనుకుంటాను కాని, ఖచ్చితంగా చెప్పలేను.




అమిత్... లే.. లే!



అమిత్ గాఢంగా గుర్రు పెడుతున్నాడు.




టీమ్ బి బెల్ నొక్కింది.




అమిత్ నిద్ర మత్తులోంచి లేచాడు. రేష్మి బుబ్బాలూ కూల్ మింట్‌ని అమిత్ నోట్లో పెట్టింది. అతడు చప్పరించాడు.



... ఉన్నట్లుండి అమిత్‌పై నీళ్లు వేగంగా చిందాయి, దాంతో అతడు లేచాడు.



ఎ టీమ్‌కి 15 సెకనుల సమయమే ఉంది.




బుబ్బాలో కూల్ మింట్‌తో ఒక్కసారిగా తాజాదనం ఆస్వాదించండి!

